# పడతీ సునీతి శతకము

సూరి కృష్ణయ్య శాస్త్రిచే

బాలికల కంఠోపయుక్తమగునట్లు రచియింపఁబడి,

లోకవిఖ్యాతకీర్తి ప్రధానులు, శతావధానులు నగు

చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారిచేఁ

పరిష్కరింపఁబడి

సన్నిధానం కృష్ణమూర్తిగారిచే

టీకాతాత్పర్యములు వ్రాయబడి



పబ్లిషర్సు :

రామా అండ్ కో, ఏలూరు.

రామా ముద్రాక్షరశాల, ఏలూరు.

 [వెల 0-8-0



శ్రీమహాగణాధిపతయేనమః.

# సుదతీ సునీతి శతకము.

క. శ్రీరఘురాముని భామిని
చారుచరిత సీత మ్రొక్కి సతులకు నీతుల్
గూరిమి జెప్పెద సుదతుల
కా రమణి యొసంగు సుగుణ మవనిని సుదతీ![1]

టీ. సుదతీ=ఓఅమ్మాయీ, శ్రీరఘురాముని=శ్రీరఘుమహారాజ వంశమందు పుట్టిన రామునియొక్క, భామిని = స్త్రీ (అనగా రాముని భార్య యగు సీత) చారు = అందమైన, కొనియాడదగిన, చరిత = నడవడి గలిగిన, సీతన్ మ్రొక్కి = సీతకు నమస్కరించి, సతులకు = స్త్రీలకు (బాలికలకు) నీతుల్ = మంచిమార్గములను, (మాటలను) కూరిమిన్ = ప్రేమతో, చెప్పెదన్ = పలికెదను; సుదతులకు = స్త్రీలకు, ఆరమణి = ఆస్త్రీ, (సీత) అవనిని = భూమియందు, సుగుణము = మంచిబుద్ధిని, ఒసంగుత = ఇచ్చుత.

తా. శ్రీరఘువంశమున బుట్టిన రాముని భార్య యగు సీతకు నమస్కరించి బాలికలకుం గొన్ని నీతులను ప్రేమతో పలికెదను. ఆమె బాలికలకు మంచి గుణము ఇచ్చును గాక!

---

1 సుదతీ=ఓ అమ్మాయీ, ఇది సంబోధనపదము. ప్రతిపద్యమునను చివర చెప్పియున్నారు.

క. మగపిల్లలతో పాటుగ
మగువలు చదువంగవలయు మఱిచదువమిచే
మగ డేనీతులు సెప్పిన
వెగటైమది కెప్పుడుదోచు వినగా సుదతీ. 2

టీ. సుదతీ, మగపిల్లలతో, పాటుగ = సమానముగ, మగువలు = బాలికలు, చదువంగవలయున్ = చదువవలయును; మఱి = మఱియు, చదువమిచే = చదువక పోవుటచే, మగడు = భర్త, ఏ, నీతులు, చెప్పినప్పటికిని, వినగాన్ = వినుటకు, మదికెప్పుడున్ = మనస్సున కెప్పుడును, వెగటై = ఇష్టము లేనిదై, తోచున్ = తోచును.

తా. బాలురవలె బాలికలును చదువవలయును చదువక పోయిన భర్తలు ఏనీతులు చెప్పినను మనస్సున కెప్పుడును ఇష్టముగ తోచవు.

క. తల్లిచదువెఱిగి యుండిన
బిల్లల చదివించు నెంతపిన్నతనములో
నల్లరిగ దిరుగనీయదు
మెల్లగ బోధించుదాన మేలగు సుదతీ. 3

టీ. సుదతీ, తల్లి, చదువెఱిగి = చదువు తెలిసి, ఉండినన్ = ఉన్నట్లయిన, ఎంత పిన్నతనములోన్ = ఎంత చిన్నయీడునను, పిల్లలన్ = పిల్లలను (బాలికలను) చదివించున్; అల్లరిగన్ = అగడముగ, భయభక్తులులేక, తిరుగనీయదు; దానన్ = అందువలన, మేలగు = మంచి కలుగును.

తా. తల్లి, చదువుగలదైనయెడల ఎంత చిన్నతనమందైనను, తన పిల్లలను అల్లరిగ తిరుగనీయదు. పాఠముల నేర్పును. అందుచే పిల్లలు మంచివారగుదురు.

క. చదువని తల్లికి బిల్లల
జదివించుట కెప్పుడయిన శ్రద్ధగలుగునా

ముదితలు తనయుల దండన
మదినోర్వక వారి చదువు మాన్పరె సుదతీ. 4

టీ. సుదతీ, చదువని, తల్లికిన్ = తల్లికి, పిల్లలకున్ = పిల్లలకు, చదివించుటకు = చదువు చెప్పించుటకు, ఎప్పుడైనన్ = ఏసమయమందైనను శ్రద్ధగలుగునా = చదివించవలెనను ఆసక్తి గలుగునా? ముదితలు = స్త్రీలు, ఆడువారలు, తనయుల = కుమారుల యొక్క, దండన = శిక్షను, మది నోర్వక = మనస్సునందు ఓర్వలేక, (సహించక) వారిన్ = వారిని, చదువు, మాన్పరె = మాన్పుచున్నారు గదా. (మాన్పగూడదు)

తా. చదువురాని తల్లి తన పిల్లలను చదివించవలెనని ఎఱుగదు. కొందఱు తల్లులు తమ కుమారులు శిక్షింపబడుటకు ఒప్పుకొనక వారి చదువు మాన్పుదురు. అట్లు చేయరాదు.

క. కలవారింటను బుట్టిన
బాలికయు గురునొద్ద శ్రద్ధబూని చదువమిన్
తెలియదు చదువను వ్రాయను
తెలియదు నీతియును దీని దెలియుము సుదతీ. 5

టీ. సుదతీ. కలవారింటను = డబ్బుగలవారి యింటియందు, బుట్టిన = పుట్టినటువంటి, బాలికయున్ = బాలికయును, గురునొద్ద = పంతులు దగ్గఱ, శ్రద్ధబూని = ఆసక్తి గలిగి, చదువమిన్ = చదువక పోవుట చేతను, చదువను = చదువుటయును, వ్రాయను = వ్రాయుటయును, తెలియదు = ఎఱుగదు; నీతియును, తెలియదు; దీనిన్ = ఈవిషయమును, తెలియుము = తెలిసికొనుము.

తా. ధనవంతులయిండ్ల పుట్టినను బాలిక మిక్కిలి పట్టుదలగలదై పంతులు దగ్గఱ, చదువక పోయిన, చదువుట, వ్రాయుట, అనువిషయములను తెలిసికొనలేదు. కనుక, యీవిషయమును తెలిసికొనవలయును.

క. మసలక వేకువ దినమున
వెసనిద్దుర లేచి బాహ్యావిధి దీర్చియు నీ
పసితనమున జదువుము మఱి
విసువక పనిపాటలందు వెలయుము సుదతీ. 6

టీ. సుదతీ, మసలక = ఆలస్యముచేయక, వేకువదినమునన్ = తెల్లవారువేళ, కాకులు కూయునప్పుడు, వెస = వేగముగ, త్వరగ, నిద్దురలేచి = నిద్రనుండిలేచి, బాహ్యావిధి దీర్చియున్ = కాలకృత్యముల జరపి, పసితనమునన్ = చిన్నతనమందు, చదువుము; మఱి = ఇంకను, పనిపాటలందు, విసువక = చికాకుపడక, వెలయుము = మెలగుము.

తా. తెల్లవారువేళ లేచి కాలకృత్యముల జరిపి, చదువుటకు మొదలుపెట్టుము. తీరికయైనపుడెల్ల, ఇంటిపనులయందు కాలముగడిపి మర్యాదను పొందుము.

క. ఇంటిపనులెల్ల నేర్చుచు
గంటయయిన దినదినంబు గడు బ్రీతిగ నీ
యింటను సహజుల సన్నిధి
గొంటెతనముమాని చదువుకొనవలె సుదతీ. 7

టీ. సుదతీ, ఇంటిపనులెల్లన్ = ఇంటిపనులన్నిటిని, నేర్చుచున్ = తెలిసికొనుచు, దినదినంబున్ = ప్రతిదినమును, గంటయయినన్ = ఒక గంటసేపైనను. కడున్ = మిక్కిలి, ప్రీతిగన్ = ప్రేమతో, నీయింటను = నీయింటియందు, సహజుల = తోబుట్టువుల, (అన్నదమ్ములు, అక్కచెల్లెండ్రు) సన్నిధిన్ = దగ్గఱ, కొంటెతనము = అల్లరిని, మాని, చదువుకొనవలెన్ = చదువవలయును.

తా. ఇంటిపనులు చేయుచు, రోజునకు ఒక గంటసేపైనను అక్కచెల్లెండ్ర. అన్నదమ్ములవద్ద చదువుచు అల్లరిమాని యుండుము.

క. నీతి చదువభ్యసించుట
చేతను నీమదికి మంచిచెడ్డలు దెలియున్
చేతనొక వెలుఁగు నిడుకొన
గా తమమెటు పిడకుండుగనుగొన సుదతీ. 8

టీ. సుదతీ, నీతిచదువు = మంచిచదువు, అభ్యసించుటచేతను = నేర్చుకొనుటచేతను, నీమదికి = నీమనస్సునకు, మంచిచెడ్డలు, దెలియున్ = తెలియును; కనుగొనన్ = చూడగా, చేతన్ = చేతియందు, ఒకవెలుగున్ = ఒకదీపమును, ఇడకొనగా = ఉంచుకొనగా, తమము = చీకటి, ఎటు = ఏవిధముగ, పిడకుండున్ = పోకుండును?

తా. చదువుటచే మంచిచెడ్డలు తెలియును. ఎట్లనగా చేతియందు దీపముంచుకొనిన చీకటనిపించదు. (ఇక్కడ చదువు దీపపు కాంతికిని, చదువులేకపోవుట చీకటికిని పోలిక.)

క. నీచదువు నీతికొఱకే
యోచంచలనేత్ర మదిని యోచించుము నీ
వే చని సంపాదింపగ
నీచమనుచు దెలిసి యింట నిలువుము సుదతీ. 9

టీ. సుదతీ, ఓ చంచలనేత్ర = ఓ బాలికా, మదిని యోచించుము = నీ మనస్సునందు ఆలోచించుము; నీచదువు = నీయొక్క చదువు, నీతికొఱకే = మంచి చెడ్డలు తెలిసికొనుటకే; నీవె, చని = వెళ్ళి, సంపాదింపగ = డబ్బు సంపాదించుట, నీచమనుచు = చెడుపనియని, తెలిసి = తెలిసికొని, యింటన్ = యింటియందు, నిలువుము = ఉండుము; ఇది = ఈ విషయము. మదిని యోచించుము.

తా. స్త్రీలకు చదువు మంచి చెడ్డలు తెలిసికొనుటకే. వారు శిస్థు వదలి డబ్బును సంపాదించుటకు బయలుదేరకూడదు.

క. శృంగారపు పదముల నెపు
డంగన చదువంగ కూడ దందరి యెదుటన్
పొంగుచు బాడకు మది దు
స్సంగతి విడి పుణ్యకథలు చదువుము సుదతీ. 10

టీ. సుదతీ, శృంగారపు, పదములన్ = పద్యములను, ఎపుడు, అందరి ఎదుటన్, అంగన = స్త్రీ, బాలిక, చదువంగకూడదు = చదువరాదు; మదిన్ = మనస్సునందు, పొంగుచున్ = విఱ్ఱవీగుచు, పాడకు = పాడకుము; దుస్సంగతివిడి = చెడు సహవాసము వదలి, పుణ్యకథలు, చదువుము.

తా. స్త్రీ ఎప్పుడును శృంగారపుస్తకములను అందరి ఎదుటను చదువరాదు. చెడుస్నేహములవదలి, రామాయణ భారత భాగవతముల లోని పుణ్యకథలను చదువుటమంచిది.

క. చదివితి ననియెడిగర్వము
మదినిడి పని నేర్చుకొనుట మానకుమింటన్
వదినెలతో న త్తలతో
నొదిగియు గష్టములకైన నోర్వుము సుదతీ.

టీ. సుదతీ, చదివితిననియెడి = చదివితిననెడు, గర్వము, మదినిడి = మనస్సునందుంచికొని, యింటన్ = యింటియందు, పని నేర్చుకొనుటన్ = పనులను తెలిసికొనుటను, (ఊడ్చుట, నీళ్లుచల్లుట) మానకుము; వదినల తోన్ = వదినలతోను, అత్తలతోన్ = అత్తలతోను, ఒదిగియు = అణఁకువగలిగి, కష్టములకైనన్ = కష్టములు పడుటకైనను, ఓర్పుము = ఓపిక గలిగియుండుము.

తా. "మనము చదువు నేర్చితిమి. పనులెందు"కని మానకుము. భర్తయింటిలో వదినలతోను, అత్తలతోను ఎన్నికష్టములకైనను ఓపిక పట్టుము.

క. చదివి సుఖమార్గపద్ధతి
సదమలముగ గాలి నీరు సరసాన్నంబుల్
కొదువేమి లేక గొనినను
విదితారోగ్యంబు గలుగు విడువక సుదతీ.

టీ. సుదతీ, చదివి, సుఖమార్గపద్ధతి = సుఖపడువిధమున, సదమలముగ = మురికిలేని, గాలి, నీరు, సరసాన్నము = మితమును రుచియు నైన ఆహారమును, కొదువేమిలేక = లోటులేకుండ, కొనినన్ = తీసికొనినయెడల, విడువక = వదలక, విదితారోగ్యము = మంచిఆరోగ్యము, (జబ్బులేక యుండుట) కలుగు = కలుగును.

తా. సుఖించుటకు మంచిగాలి, నీరు, తగినఆహారము తీసికొనినయెడల, జబ్బుచేయదు.

క. ఆటలయందును బరుసపు
మాటలు తగదమ్మ తోడి మగువలతోడన్
బూటకము వలదు దానన్
జేటు గలుగు నమ్మమిదియె సిద్ధము సుదతీ. 13

టీ. సుదతీ, ఆటలయందు = ఆటలాడునపుడు, బరుసపుమాటలు = కఠినపుమాటలు, (పలుకుట) తగదమ్మ = కూడదమ్మ; తోడిమగువలతోడన్ = తనతో తిరుగు పిల్లలతో, బూటకము = అబద్ధము, (టక్కరితనము) వలదు = కూడదు; దానన్ = అందువలన, చేటు = కీడు, అపాయము, కలుగున్ = కలుగును; ఇదియే, నమ్మను, సిద్ధము = నిశ్చయము.

తా. ఆటలాడునపుడు పోట్లాడరాదు. చెలులతో అబద్ధముకూడదు. దానివలన కీడుకలుగునని నమ్మము. ఇది నిజము.

క. తలిదండ్రులు నీక్షేమము
దలచియె చెప్పెదరుగాన దఱచుగ నీవా
పలుకులు బెడచెవి బెట్టకు
మిల పెద్దలమాట చద్దికెనయగు సుదతీ. 14

టీ. సుదతీ, తలిదండ్రులు, నీక్షేమము = నీబాగు, నీమంచిని, తలచియె = కోరియె, చెప్పెదరు; కాన = కావున, తఱచుగ = ఎప్పుడును, నీవు, ఆపలుకులు = తలిదండ్రులు చెప్పుమాటలను, పెడచెవి పెట్టకుము = వినకుండా ఉండకుము (వినుము) ఇలన్ = భూమియందు, పెద్దలమాట = పెద్దలు చెప్పినమాట, చద్దికెనయగు = చద్దితో సమానమగును.

తా. తలిదండ్రులు నీమంచి కోరి చెప్పుదురు. కనుక వారు చెప్పినట్లు చేయుము. "పెద్దలమాట పెరుగు అన్నముతో సమాన" మన్న పలుకులు మనస్సునందుంచు కొనుము.

క. పెద్దలు నీతో చేయగ
వద్దని చెప్పినను దానివారక చేయన్
ముద్దియ కర్తవ్యంబును
తద్దయు చేయకయున్న తప్పే సుదతీ. 15

టీ. సుదతీ, పెద్దలు = నీకంటె వయసునందును, తెలివియందును పెద్దలు, (తల్లి, దండ్రి మొదలగు వారు) నీతో, చేయక వద్దని చెప్పినను = చేయవలదని పలికినప్పటికిని, దానిన్ = ఆపనిని, వారక = లక్ష్యపెట్టక, వినక, చేయన్ = చేయుట, తప్పే; ముద్దియ = ఓబాలిక, కర్తవ్యంబు = చేయదగిన పనిని, తద్దయు = మిక్కిలి, చేయకయున్న = చేయకపోవుట, తప్పే = అదికూడ తప్పే యగును.

తా. నీతో పెద్దలు చేయవలదని చెప్పినదానిని చేయుగూడదు. చేయుమని చెప్పిన దానిని చేయక పోవుట తప్పు. ఏపని చెప్పినను చేయవలయును. (పూర్వము తండ్రిమాటమీద పరశురాముడు తల్లిని చంపెను.)

క. మన దేశపు వేషముతో
మనము మెలఁగవలెను దానిమార్పకు మెప్పుడున్
గనువారు నగుదు రిలలో
ననయము లోకులకు వెగటవనగు సుదతీ 16

టీ. సుదతీ, మనము, మనదేశపు వేషముతో = మనదేశమందు కట్టుకొనవలసిన బట్టలతో, మెలఁగవలెను = సంచరించవలెను; ఎప్పుడున్, దాని = మనదేశపుబట్టలను, మార్పకుము = తప్పించకుము; ఇలలోన్ = భూమియందు కనువారు = చూచువారు, నగుదురు = నవ్వుదురు; అనయము = ఎల్లప్పుడు. లోకులకు, వెగటవనగు = భయపడవలయును; (ఇతరులేమనుకొందురోయని ఆలోచించవలెను.)

తా. దేశాచారమునకు తగినట్లుగ బట్టలను కట్టుకొనవలయును. లేనిచో వింతగనుందును. అందఱు ఆక్షేపింతురు.

క. నీటుగఁ దిరుగకు మెప్పుడె
చ్చోటను నినుఁ జూచినట్టి సుదతీజనమీ
బోటివగలాడి యనుచును
చాటుదు రిది తెలియుమమ్మ చక్కఁగ సుదతీ. 17

టీ. సుదతీ, ఎప్పుడున్, ఎచ్చోటన్ = ఎచ్చటనైనను, నీటుగ = గర్వముగ, తిరుగకుము; నినున్ = నిన్ను, చూచినట్టి = చూచినటువంటి, సుదతీజనము = స్త్రీసమూహము, (బాలికాసమూహము) ఈబోటి = ఈ స్త్రీ. వగలాడి = (లోకాచారమునకు విరుద్ధముగా సంచరించునది.) అనుచును, చాటెదరు = తెలియఁజేయుదురు. (చాటించెదరు.) ఇది = ఈ విషయము, చక్కఁగన్ = బాగుగ, తెలియుమమ్మ = తెలిసికొనుము.

తా. నీవు ఎచ్చటను, ఎప్పుడును, గర్వముగ తిరుగవద్దు. అట్లు చేసిన నిన్ను చూచినవారందరు వగలాడి యని అల్లరి చేయుదురు. దీనిని తెలిసికొనవలసినది.

క. చక్కని దాననుచు నీ
వెక్కువ గర్వంబు గూడ దిల నీకంటెన్
జక్కని వారల నెంచఁగ
నెక్కువగా నుంద్రు దెలియు మొప్పుగను సుదతీ. 18

టీ. సుదతీ, చక్కని దానన్ = అందముగల దానిని, అనుచున్ = అనుకొనుచు, నీ వెక్కువ = నీవు ఎక్కువగ, గర్వంబు గూడదు = గర్వముగా యుండుట తగదు; ఇలన్ = భూమి యందు, ఎంచఁగన్ = లెక్క పెట్టగా, నీకంటెన్ = నీకంటెను, చక్కని వారల్ = అందము గలవారలు, ఎక్కువగాన్ = లెక్కకు మితిమీరిన వారుగ, ఎప్పుడున్, ఉంద్రు = ఉందురు, అని, తెలియుము.

తా. అందముగల దానవని గర్వపడకుము. నీ కంటె సుందరులు అనేకులు ఉందురని తెలిసికొనుము.

క. కలికిరో యొడలును దలయును
వలువలు మాసినను జోడి వనితలు నీతోఁ
గలసి మఱియాడ రోతురు
దెలిసి శుచిగ నుండుమమ్మ తిరముగ సుదతీ. 19

టీ. సుదతీ, కలికిరో = ఓ బాలికా, యొడలును = దేహమును, తలయును, వలువలున్ = బట్టలును, మాసినను = మురికిగాయైనను, జోడి వనితలు = చెలులు, (వనిత = స్త్రీ) నీతోన్ = నీతో కలసి, మఱి, యాడ రోతురు = ఆడుటకు ఇష్టపడరు; అని, దెలిసి = తెలిసికొని, తిరముగన్ = ఎల్లప్పుడును, శుచిగన్ = శుభ్రముగ, ఉండుమమ్మ = ఉండవలసినది.

తా. ఓ బాలికా! ఒళ్ళు, తల, కట్టు బట్టలు మాసిన, నీ చెలులు అసహ్యపడి నీతో ఆటలాడరు. ఇవి నేర్చుకొని శుభ్రముగ నుండుము.

క. కన్నియ జనకుఁడు వృద్ధున
కెన్నఁడు నిన్నొసఁగు ననుచు నిలలో నున్నన్
దిన్నఁగఁ దలిదండ్రులకే
విన్నప మొనరించు మిచ్ఛ వెరువక సుదతీ. 20

టీ. సుదతీ. కన్నియ = ఓ బాలికా, ఇలలోఁ = భూమియందు, జనకుఁడు = తండ్రి, యెన్నఁడుఁ = యెన్నడైనను, నినుఁ, వృద్ధునకుఁ = ముసలివానికి, వయసుమీరినవానికి, ఒసఁగుననుచు = ఇచ్చెదననుచు, ఉన్నన్ = ఉండిన యెడల, వెరువక = భయపడక, ఇచ్ఛ = కోరికను, తిన్నఁగన్ = మంచితనమున, తలిదండ్రులకే, విన్నపము = మనవి, ఒనరించుము = చేయుమమ్మ.

తా. తలిదండ్రులు నిన్ను ముసలివానికిచ్చి పెండ్లిచేసెదమనిన, నీ మనస్సులోనున్న కోరికను మంచి తనమున వారలచే ఒప్పించుకొని, నీ కోరిక తీర్చుకొనుము.

క. జననీ జనకులు నీకును
మనమున మేలెంచి యెవని మగనిని జేయన్
గనుఁగొనుము వాని ఘనునిగ
ననఘుఁడు దైవంబు వ్రాసె నని నిను సుదతీ. 21

టీ. సుదతీ, జననీజనకులు = తలిదండ్రులు, నీకును, మనమున = మనస్సునందు, మేలెంచి = మంచిని విచారించి, యెవని = యేమనుష్యుని, మగనిని = భర్తగా, జేయుఁగా = చేయుదురో, వానిన్ = ఆభర్తను, అనఘుఁడు = గొప్పవాడు, అని. దైవంబు వ్రాసె = దేవుడువ్రాసెను. (యేదైనను కష్టములు వచ్చినప్పుడు దైవమును తిట్టుదురు.)

తా. తలిదండ్రులు నీమంచికోరి యెవనిని భర్తగా జేయుదురో వానిని పూజించుము, దైవము ఇచ్చినట్లుగ తలపవలయును.

క. పిల్లల నమ్మెడివారల
కెల్లరకును సొమ్మునిల్వ దేవిధినైనన్
జెల్లాచెదరై పోవును
తల్లికి దండ్రికిని నిందతప్పదు సుదతీ 22

టీ. సుదతీ, పిల్లలన్ = పిల్లలను, అమ్మెడివారలకు = అమ్మువారలకు, ఎల్లరకును = అందరికిని, సొమ్ము = ధనము, డబ్బు (పిల్లలనమ్ముటచే వచ్చినది) నిల్వదు = నిలిచియుండదు ; చెల్లాచెదరై = పలుతెరంగులై, (క్రమముగా తరుగును) పోవును; తల్లికిదండ్రికిని = తలిదండ్రులకు, నింద తప్పదు = అపవాదుపోదు.

తా. పిల్లలను వివాహములకై అమ్మి ధనము సంపాదించినను చాల కాలము ఉండదు. పాడైపోవును. సొమ్ముపోయినను అపకీర్తితప్పదు.

క. అల్లుని జేయగదలచిన
పిల్లనిరూపంబు విద్య పెద్దరికంబుల్
తల్లియు దండ్రియు జూచియు
పిల్లనొసగుదురు గదమ్మ ప్రీతిగ సుదతీ. 23

టీ. సుదతీ, అల్లునిగ = అల్లునిగ, చేయగదలచిన = చేయదలచిన పిల్లనిరూపంబు = పిల్లవాని ఆకారమును, విద్య = చదువును, పెద్దరికంబుల్ = వంశమునందలి మంచిచెడ్డలు, తల్లియున్, తండ్రియున్, చూచియు = చూచినపిమ్మటనే, (చూచి, వారలమనస్సునకు వచ్చినతరువాత) పిల్లన్ = పిల్లను, ప్రీతిగన్ = ప్రేమతో, ఒసగుదురుకదమ్మ = ఇచ్చెద కదా. (ఇత్తురని అర్థము)

తా. పిల్లను ఒకరికియిచ్చునప్పుడు, తలిదండ్రులు, కాబోవుఅల్లుని యొక్క, వారివారితరములయొక్క మంచిచెడుగులు విచారించి ప్రేమతో గూడినవారలై పిల్లతోనిత్తురుగదా!

క. అన్నివిధంబుల జనకుడు
తిన్నగను పరీక్ష జేసి తెచ్చినమగడే
కొన్నాళ్ళకు చెడుగైనను
కన్నియ యది నీదుపూర్వకర్మముసుదతీ 24

టీ. సుదతీ, కన్నియ = ఓబాలికా, అన్నివిధంబులన్, జనకుడు = తండ్రి, తిన్నగను = తగినట్లుగ, పరీక్షజేసి = పరీక్షించి, తెచ్చిన = తెచ్చినటువంటి, మగడే = భర్తయే, కొన్నాళ్ళకు = కొన్నిదినములకు, చెడుగైనను = చెడుప్రవర్తన కలిగిన వాడైనను, అది = భర్తచెడుటఅనునది, నీదు = నీయొక్క, పూర్వకర్మము = క్రిందటిపుట్టువునందు జేసిన కర్మఫలితముఅని తెలిసికొనుము.

తా. అన్నివిధంబులచేత, తల్లిదండ్రులాలోచించి, తమకుమార్తెకు తగిన వానిని పెండ్లిచేయుదురు. కొన్నాళ్ళకు అతడు చెడ్డవాడైనయెడల, ఆ భార్యయొక్క పూర్వముచేసికొనిన పుణ్యమే.

క. కలవారు కలిగినట్టుగ
బాలతి నొసగి భర్తతోడ బొమ్మనవలెగా
కలికి నొసగి శుల్కముగొన
దలపగ దగదెంత లేకతనమున సుదతీ. 25

టీ. సుదతీ! కలవారు = డబ్బు కలిగినవారు, (ధనవంతులు) కలిగినట్టుగన్ = తమకు ఉన్నదానిలో, బాలతికన్ = బాలికను, (తమ పిల్లలను) ఒసగి = యిచ్చి, భర్తతోడన్ = మగనితో, పొమ్మనవలెగా = పొమ్మనవలెను; కలికిన్ = పిల్లను, ఒసగి = యిచ్చి, శుల్కమున్ = డబ్బును, కట్నమును, ఎంతలేకతనమునన్ = ఎట్టి దరిద్రస్థితిలోనున్నను, కొనన్ = తీసికొనుటకు, తలపగన్ = తలచుట, తగదు.

తా. తమ శక్తి కొలది పిల్లలను కాపాడి లిచ్చి భర్త వెంట పంప వలెను. కాని, దరిద్రులైనను, తమ యల్లుండ్రనుంచి ధనము తీయరాదు.

క. పతియే దైవంబనుచును
మతి దలపుము దాన నీకు మాన్యతవచ్చున్
పతితో బోరాడిన యా
సతి గయ్యాళి యనఁబరగు సుదతీ. 26

టీ. సుదతీ, పతియే = భర్తయే, దైవంబంచున్ = దేవుడనుకొనుచు, మతిన్ = మనస్సునందు, తలపుము = తలచుము; దానన్ = అందుచేత నీకున్, మాన్యత = మర్యాద, వచ్చున్ = కలుగును; సతతము = ఎల్లప్పుడును, పతితోన్ = భర్తతో, పోరాడిన యాసతిన్ = పోట్లాడిన యా స్త్రీ, గయ్యాళి యనబరగున్ = గయ్యాళి అని పిలువబడును.

తా. భర్త దైవమని తలపుము. అందు వలన నీకు గౌరవము కలుగును. భర్తతో జగడమాడు స్త్రీని గయ్యాళి అందురు.

క. పతియే గతియనుచును నీ
మతిలోపల దలప వలయు మానక యెపుడున్
పతిదుష్టుడైన వానిని
మతినైనను దూరవలదు మహిలో సుదతీ. 27

టీ. సుదతీ, పతియే, భర్తయే, ఎపుడున్ = అన్ని కాలములందు, గతియనుచును = ఆధారమనుకొనుము, నీమదిలోనన్ = నీ మనస్సునందు, మానక = నియమముతప్పక, తలపవలయున్ = ఎంచవలెను; మహిలోన్ = భూమియందు, దుష్టుడైనవానిన్ = చెడుగుణములు గల వానినైనను, పతిన్ = భర్తను, మతినైనన్ = మనస్సునందైనను, దూరవలదు = తిట్టరాదు.

తా. భర్త కంటె వేరు గతి లేదని ప్రతి ఆడుది ఎరుగ వలయును. భర్త చెడుగుణములు గల వాడైనను తిట్టరాదు

క. పురుషుని జెడనాడినచో
బరకాంతల చేరుచుండు భామిని దానన్
బరిపరివిధముల బాముల
కిరవగుదువు నీవు దెలియు మెప్పుడును సుదతీ. 28

టీ. సుదతీ, పురుషునిన్ = మగవానిని, (భర్తను) చెడనాడినచో = తిట్టిన యెడల, పరకాంతలన్ = ఇతర స్త్రీలను, చేరుచుండున్ = కలియు చుండును; కావున = కాబట్టి, భామిని = స్త్రీ, దానన్ = అందువలన, (అట్లు తిట్టిన) నీవు, పరిపరి విధములన్ = అనేక విధములయిన, బాముల కిర వగుదువు = కష్టముల పాలగుదువు; (అని) ఎప్పుడున్, తెలియుము.

తా. భర్తను తిట్టిన, అతఁడు ఇతర స్త్రీలవద్దకు పోవును. అందుచే నీక నేక కష్టములు కలుగునని తెలిసికొనుము.

క. నిను బ్రేమించక మఱియొక
వనితఁగలసి మెలఁగునట్టివరు నేవేళన్
బనిఁబూని దూల నాడకు
మనయము దయఁగోరు మేలునందెదు సుదతీ. 29

టీ. సుదతీ, నిను బ్రేమించక = నీయందిష్టములేక, మఱియొక వనితన్ = ఇతర స్త్రీని, కలసి = కూడి, మెలఁగునట్టి = తిరుగునట్టి, వరున్ = భర్తను, ఏవేళన్ = ఏసమయమందైనను, పనిఁబూని = ఒక పనిగాఁబెట్టుకొని (పంతముచే) దూలనాడకు = నిందింపకు; అనయము = ఎల్లప్పుడు (భర్తయొక్క) దయఁగోరు = ప్రేమను సంపాదింపుము; మేలునందెదు = శుభమును పొందెదవు.

తా. నిన్ను విడచి ఇతర స్త్రీలయొద్దకు భర్త వెళ్ళినను, నిందింప కుము. అతని దయనుకోరిన యెడలను నీకు మేలగును.

క. పతి గృహకృత్యంబులలో
నతికష్టము నొందుచుండ నాతఁడె నీవున్
బతికినితోడై చేయుము
కుతుకముతో బనుల శక్తికొలఁదిని సుదతీ. 30

టీ. సుదతీ, పతి = భర్త, గృహ = ఇంటియొక్క, కృత్యంబుల లోన్ = పనులలో, అతి = మిక్కిలి, కష్టము = శ్రమను, ఒందుచుండన్ = పడుచుండఁగ, అతఁడె = అసమయమందు, బతికినితోడై = భర్తకు సాయమై, కుతుకముతోన్ = వేడుకతో, పనులన్ = పనులను, శక్తికొలఁదిన్ = ఓపికయున్నంత వరకు, నీవున్, చేయుము = చేయవలసినది.

తా. భర్త యింటిపనులయందు చిక్కుపొందునపుడు నీచేతనైనంత వరకు సహాయము చేయుము.

క. నీపతి యెవ్వని పైనను
కోపముగా నున్న దెలిసికొని యప్పుడు నీ
వే పలుకులు చెప్పకుమీ
నీపయికది తిరుగుచుండు నిజముగ సుదతీ. 31

టీ. సుదతీ, నీపతి = నీభర్త, ఎవ్వనిపైనను = ఎవనిమీదైనను కోపముగానున్నన్ = కోపముగ ఉన్న యెడల, తెలిసికొని = ఎరిగి, అప్పుడు = ఎరిగిన తరువాత, నీ వేపలుకులు = నీవు ఏమాటలను, చెప్పకుమీ = చెప్పవద్దు; అది = ఆకోపము, నీపయికిన్ = నీమీదకు, తిరుగున్ = మరలును; నిశ్చయము = నిజము.

తా. నీభర్త కోపముగ వున్నప్పుడు ఏమాటలను చెప్పవద్దు. నిన్ను కూడకోపించును.

క. నీపయికోపించెడు పతి
నోపకమూరాడి తేసి యోసతి ! దానన్

తాపంబెక్కును నాజ్యం
బేపగిదిని నార్చుమంట నిలలో సుదతీ. 32

టీ. సుదతీ, నీపయి కోపించెడు పతిన్ = నీమీద కోపపడుభర్తను, ఓపక = ఓర్వక, సహింపక, మాఱాడితేని = బదులుచెప్పిన యెడల, ఓసతీ = ఓస్త్రీ, దానన్ = అందుచేతన, తాపంబెక్కును = కోపము హెచ్చును; ఇలలోన్ = భూమియందు, ఆజ్యంబు = నేయి, నెయ్యి, ఏపగిదిన్ = ఏవిధముగ, మంటన్ = మంటను, ఆర్చున్ = చల్లార్చునా? (చల్లార్చదు)

తా. భర్తకోపించిన మాఱుచెప్పకుండుట మంచిది. నిప్పులో నేయి పోసిన మంట చల్లారునా? అట్లే కోపించుభర్తకు జవాబిచ్చినకోపము మరింత హెచ్చునుగాని తగ్గదు.

క. పతియలసి వచ్చినప్పుడు
క్షితి నెక్కువడుగరాదు శీఘ్రముతో నీ
పతికాళ్ళకు నీళ్ళొసగియు
నతిరయమున భోజనంబు నమరుచు సుదతీ. 33

టీ. సుదతీ, క్షితిన్ = భూమియందు, పతి = భర్త, అలసి = శ్రమపడి, కష్టపడి, వచ్చినప్పుడు = రాగా, ఎక్కువడుగరాదు = అనేక ప్రశ్నలువేసి విసిగింపకూడదు; శీఘ్రముతోన్ = త్వరగ, నీపతికాళ్లకు = నీభర్త పాదములు కడుగుకొనుటకు, నీళ్ళొసగియున్ = నీళ్ళిచ్చియు, అతి = మిక్కిలి, ఎక్కువ, రయమునన్ = శీఘ్రముగ, భోజనంబున్ = భోజనమును, అమరుచు = సిద్ధము (తయారు) చేయుము.

తా. భర్తయలసి యింటికివచ్చినప్పుడు కుశలప్రశ్నలతో విసిగింపరాదు. త్వరగ వానికష్టము విచారించి కాళ్ళుకడుగుకొనుటకు నీళ్ళిచ్చి ఆహారమును పెట్టవలయును.

క. పతిభుజియించెడి తఱినో
యతి సంతసమునను విడెమునందెడి తఱినో
మతిగల భావముదెలిసియె
కుతుకముతో జెప్పికొనుము కోర్కెలుసుదతీ. 34

టీ. సుదతీ, పతి=భర్త, భుజియించెడి = అన్నముతినెడి, తఱినో= సమయముననో, అతిసంతసమునను = మిక్కిలి సంతోషముతో, విడెము నందెడితఱినో= తాంబూలము వేసికొనునప్పుడో, మతిగల=(భర్త)మనస్సు నందుగల, భావమున్ = అభిప్రాయమును, దెలిసియె= తెలిసికొనిన తరు వాతనె, కుతుకముతోన్ = వేడుకతో, కోర్కెలు = కోరికలను, చెప్పి కొనుము= ఎఱిఁగింపుము.

తా. భర్తభోజనము చేయునప్పుడు గాని, సంతోషముగ నున్న ప్పుడుగాని నీ మనస్సునందుగల కోరికలను చెప్పుకొనుము.

క. వ్యవహారము లడుగకుమఱి
యవియవియును జెప్పబోకు మనవసరముగా
ధవుని నెగతాళిసేయకు
మవమానింపకుము నిందలాడకు సుదతీ. 35

టీ. సుదతీ, వ్యవహారములడుగకు = నీకు అవసరములేని వ్యాపార విషయము లడుగకుము; మఱి = ఇంకను, యవియవియును = అనేకవిష ములనుగూర్చి, అనవసరముగా = అవసరములేనిచో, చెప్పబోకు = చెప్ప కుము; ధవుని = భర్తను, ఎగతాళిసేయకు = వేళాకోళము చేయకుము; (భర్తను) అవమానింపకుము = వంచనసేయకుము; చిన్నపుచ్చకుము; (భర్తను) నిందలాడకు = కఠినముగ మాటలాడకుము; తిట్టకుము,

తా. నీకు అవసరములేని వ్యవహార విషయములను, ఆయాసంగతు లను చెప్పుమని యడుగుట తగదు. భర్తను మర్యాదగ చూడుము.

క. స్త్రీపురుషుల పొందికయే
కాపురమని చెల్లుచుండుగావున భువిలో
నేపట్టున నీపురుషుని
తోఁ బాటుగ మెలఁగు శ్రద్ధతోడను సుదతీ. 36

టీ. సుదతీ, స్త్రీ పురుషుల = ఆడువారియొక్కయు, మగవారియొక్కయు, పొందికయే = కలసియుండుటయె, కాపురమని, చెల్లుచుండున్ = ఒప్పును; కావున = కాబట్టి, భువిలోన్ = భూమి యందు, ఏపట్టునన్ = ఏ కార్యమందైనను, నీపురుషునితోఁబాటుగన్ = నీభర్తతో సమానముగ, శ్రద్ధతోడన్ = శ్రద్ధతో (పనులను విడువక) మెలఁగు = చరించుము, ప్రవర్తించుము.

తా. భార్యాభర్తలు కలసి వుండుటయె కాపురము అనబడును. కాబట్టి నీభర్తతోపాటు ఎప్పుడును, కష్టమునకోర్చి, పనులందు తోడ్పడుచుండవలయును.

క. నీ పనులలోన నొకటిగ
నోపికతోఁ బ్రతిదినంబు నొకగడియైనన్
నీ పతి పాదము లొత్తుము
నీపయి దయగలుగుదాన నిజముగ సుదతీ. 37

టీ. సుదతీ, నీపనులలోనన్ = నీపనులలో, ఒకటిగన్ = ఒకపనిగ తలచి, ఓపికతోన్ = శ్రద్ధతో, ఒకగడియైనన్ = ఒకగడియకాలమైనను, (24 నిమిషములు = 1 గడియ) ప్రతిదినంబునన్ = ప్రతిరోజును, రోజురోజును, నీపతి = నీభర్తయొక్క, పదములొత్తుము = పాదములనుఒత్తుము; దానన్ = ఆకారణమున, నిజముగన్ = నిశ్చయముగ, నీపయిన్ = నీమీద, దయగలుగున్ = ప్రేమ కలుగును.

తా. నీభర్తకు గోపమును ఒక గడియకాలమయినను శాశ్వతము నీపనులలో అదికూడ ఒకపనిగ తలఁపుము. అతనిదయను సంపాదింపగలవు.

క. చెప్పిన పని తత్క్షణమే
తప్పక చేసినను ధవుడు దండించడుగా
తప్పెప్పుడు చేసి తేనియు
నొప్పుకొనుట మేలు నీకు నుర్విని సుదతీ. 38

టీ. సుదతీ, ధవుడు = భర్త, చెప్పినపని = చేయుమని చెప్పినదానిని, తప్పక = అడుగుదాటక, తత్క్షణమే = వెంటనే, చేసినను = చేసినయెడల, దండించడుగా = శిక్షింపడుగదా; తప్పెప్పుడున్ = తగని పనిని, ఎప్పుడైనను, చేసితేనియున్ = చేసినట్లయిన, ఒప్పుకొనుట = చేసితినని చెప్పుట, నీకు, ఉర్విని = భూమియందు, మేలు = మంచిది.

తా. భర్త చెప్పిన పని వెంటనే చేసిన దండించడు. తప్పుచేసినను చేసితినని ఒప్పుకొనుట మంచిది.

క. అన్నియెడల నాలోచన
నన్నడుగగ లేదటంచు నాథునితో నీ
వెన్నడు కలహించకు నిను
గొన్నిటిలో నెపుడు నడుగ గూడదు సుదతీ. 39

టీ. సుదతీ, అన్నియెడలన్ = అన్ని విషయములలో, ఆలోచనన్ = సలహాను, నన్నడుగగ లేదటంచు = సలహాలయందు నన్ను (భార్యను) అడుగలేదనుచు, నీవెన్నడున్ = నీవు ఎప్పుడును, నాథునితోన్ = భర్తతో, కలహించకు = పోరాడకుము; కొన్నిటిలోనన్ = కొన్ని విషయములలో, నినున్ = నిన్ను, ఎపుడున్, అడుగగూడదు.

తా. భర్త తనతో సలహాలుచేయు లేదని భార్య కోపించుట తగదు. కొన్ని విషయములలో నామె (భార్య) యాలోచన అడుగ నవసరము లేదు.

క. క్షితిలోన సతీపతులొక
మతిగానుండంగవలయు మరిలేమిని మీ
కతిసంకటమగు నీవును
హితము దెలుపవలె బతికెపుడును సుదతీ. 40

టీ. సుదతీ, క్షితిలోనన్ = భూమియందు, సతీపతులు = భార్యాభర్తలు, ఒకమతిగానుండంగ వలయున్ = ఒక్కమాటమీదనె నిలుకబడియుండవలయును; మరిలేమిని = అట్లుండకపోవుటచే (వారిమాటలు కలియకపోవుటచే, భేదించిన) మీకు = మీయిద్దఱకు, (భార్యాభర్తలకు) అతి = మిక్కిలి, సంకటమగున్ = కష్టమాకలుగును; పతికిన్ = భర్తకు, ఎపుడును, నీవును, హితము = మంచిని, దెలుపవలెను = తెలుపవలయును.

తా. భార్యాభర్తలిద్దరు ఒక మాటమీదనె యుండవలయును. అట్లు లేకుండిన ఉభయులకు (భార్యాభర్తలకు) కష్టములు కలుగును. కావున భార్య యెప్పుడును మంచినే చెప్పుచుండ వలయును.

క. సంపాదించెడు మగనిని
యింపుగ జూచుటది యొక్కయింగితమె భువిన్
సంపాదన కసమర్థుని
సొంపుగ మర్యాదచేయు సుగుణము సుదతీ. 41

టీ. సుదతీ, భువిన్ = భూమియందు, సంపాదించెడు = తనశక్తిచే కష్టపడి తెచ్చునటువంటి, మగనిని = భర్తను, యింపుగజూచుట = ప్రేమించుట, అదికూడా = అట్లు ప్రేమించుటయు, ఒక్క యింగితమె = ఒక విశేషమైన జ్ఞానమా? పాండిత్యమా? (అనగా కాదని అర్థము); సంపాదనకసమర్థుని = సంపాదించలేని, మగనిని = భర్తను, సొంపుగన్ = తగునట్లుగ, మర్యాదచేయుట = గౌరవించుట, సుగుణము = మంచిగుణము.

తా. సంపాదించు భర్తను గౌరవించుటకంటె సంపాదింపలేని భర్తను గొలుచుట అన్ని విధములచేతను మంచిది.

క. మగడార్జించిన ద్రవ్యము
మగువరో నీకిచ్చెనేని మరియు మితముగా
నొగివెచ్చపెట్టి లెక్కను
మగనికి చెప్పంగవలయు మఱువక సుదతీ. 42

టీ. సుదతీ, మగువరో = ఓస్త్రీ, మగడార్జించిన = భర్తసంపాదించినట్టి, ద్రవ్యము = ధనము, డబ్బు, నీకిచ్చెనేని = నీకు యిచ్చినట్లయిన, మరియు, మితముగా = ఇంకను తక్కువగ, ఒగి = క్రమముగా, వెచ్చపెట్టి = ఖర్చుపెట్టి, మఱువక = మఱచిపోక, జ్ఞాపకముంచుకొని, మగనికి = భర్తకు, లెక్కను = జమాఖర్చులను (చేసినఖర్చు నిలవయున్న సొమ్మునుగూర్చి) చెప్పంగవలయున్ = చెప్పవలయును.

తా. భర్త యిచ్చిన సొమ్మును తగినట్లు ఖర్చుపెట్టి భర్తకు ఖర్చు వివరములు తెలియచేయవలయును.

క. నీమంచి చేతనేగద
యోమానిని నీదుమగని నుత్తముడనుచున్
వేమారు లనెద *రతిథులు
భూమిని యశమునకు మగువ పుట్టిలు సుదతీ. 43

టీ. సుదతీ, ఓమానిని = ఓస్త్రీ, నీమంచిచేత నేగదా = నీయొక్క మంచితనముచేత నేగదా, నీమగనిన్ = నీభర్తను, ఉత్తముడనుచున్ = మంచివాడనుచు, అతిథులు = బ్రాహ్మణులు, వేమారు అనెదరు = అనేక పర్యా

---

* అతిథి. అతిథి, అభ్యాగతి అని రెండు తెగలు. అన్నము తిన బోవుచు వచ్చువాడు అభ్యాగతి, వచ్చి కనిపెట్టుకయుండువాడు అతిథి.

యములు పలికెదరు; మగుఁడ = ఓ స్త్రీ, భూమిని = భూమియందు, యశము
నకు = కీర్తికి, పుట్టిలు = పుట్టిల్లువంటిది.

తా. భార్య గుణవతియైన భర్తకు మంచికలుగును. స్త్రీకీర్తికి పుట్టిల్లువంటిది. (భర్తలకు తమ భార్యలవలనే, కీర్తికలుగును)

క. అందముగా నుండుము పతి
ముందర నెల్లపుడు నగవు మొగమే తగుఁగా
కొందఱు కొఱకొఱలాడుచు
మందిరమును జేరనీరు మగనిని సుదతీ. 44

టీ. సుదతీ, పతిముందరన్ = భర్తయెదుట, అందముగానుండుము; ఎల్లపుడున్, నగవు మొగమే తగుఁగా = నవ్వుమొగమే చెల్లును; (చిరునవ్వు నవ్వుచుండవలెను) కొందరు = మరికొందరు, మగనిని = భర్తను, కొఱకొఱలాడుచున్ = చిఱచిఱలాడుచు, (కోపపడుచు) మందిరమును జేరనీరు = ఇంటికి రానీయరు.

తా. భార్య భర్తనెప్పుడును సంతోషముతో చూడవలయును. కొందఱెప్పుడును కసుబుసులాడుచు భర్తలను ఇంటికిరానీయరు.

క. ధర సంసారపుభారము
భరియింపంగాను సతియు బతియును సములే
పురుషుండార్జింపను సతి
సరిగా నుచితవ్యయంబు సల్పును సుదతీ. 45

టీ. ధరన్ = భూమియందు, సంసారపు = కాపురముయొక్క, భారము = బరువు, భరియింపంగాను = మోయుటకు, వహించుటకు, సతియున్ = భార్యయును, పతియున్ = భర్తయును, సములే = సమానులే; పురుషుండు = మగవాఁడు, ఆర్జింపను = సంపాదించుటకును, సతి = స్త్రీ,

సరిగా = తగినట్లుగా, ఉచితవ్యయంబు = మంచివస్తువులకై ఖర్చును, సల్ప ను = చేయుటకును, (సమానులే.)

తా. సంసారమును భార్యాభర్తలు భరించవలయును. భర్త సంపాదించుటకును, భార్యతగినట్లు ఖర్చుపెట్టుటకును సమానముగ తగుదురు.

క. భావజ్ఞురాలవగుచును
కావలసిన పనులు జేయగావలె బతికిన్
కావరమున బతివిడువకు
నీవావల జేసెదేమి నిజముగ సుదతీ. 46

టీ. సుదతీ, భావజ్ఞురాలవగుచున్ = మనస్సునందుండెడు కోరికల తెలిసికొని, పతికిన్ = భర్తకు, కావలసినపనులు, చేయగావలెను = చేయవలయును; కావరమునన్ = గర్వముచే, పతివిడువకు = భర్తను వదలకుము; నీవు, అవల = అటుతర్వాత, (వదలిన తరువాత) నిజముగ = నిశ్చయముగ, నిక్కముగ, చేసెదేమి = ఏమి చేయుదువు?

తా. భర్తకోరికలను ఎఱిగిచేయవలెను. పతిని వదలవలదు. వదలిన పిమ్మట ఏమిచేయుదువు? ఇతరఆధారముదొఱకుట కష్టము.

క. మగవారితోడ నెప్పుడు
తెగబడి నిర్భయముగాను తీవ్రతతోడన్
బగగాని బలికిన దానన్
మగువలకును గీడువచ్చు మహిలో సుదతీ. 47

టీ. సుదతీ, మహిలోన్ = భూమియందు, మగవారితోడ నెప్పుడున్ = పురుషులతో నెప్పుడును, తెగబడి = సిగ్గు విడచి, నిర్భయముగాన్ = భయములేకుండగను, తీవ్రతతోడన్ = మిక్కిలి తొందరగను, పగగాని = కసి (కోపము) తో, పలికినన్ = పలికినతో, దానన్ = అకారణముచే, మగువలకు = స్త్రీలకు, కీడువచ్చున్ = ఆపద కలుగును.

తా. పురుషులతోఁ గఠినముగ మాటాడుట తగదు. ఆడిన చేటు కలుగును.

క. చెప్పనివార్తల నెప్పుడు
జెప్పుమనుచు బట్టుబట్టజెల్లదు పతితో
దప్పని దెలియుము దానను
ముప్పగుగదవె నీకు దగదుమూర్ఖత సుదతీ. 48

టీ. సుదతీ, పతితోన్ = భర్తతో, చెప్పనివార్తలన్ = చెప్పఁ గూడని (తగని) విషయములను, ఎప్పుడు, చెప్పుమనుచున్ = చెప్పవలసిన దనుచు, పట్టు = పంతము, పట్టజెల్లదు = చేయుట తగదు; తప్పని తెలియుము; దానన్ = అందు చేత, ముప్పగుగదవె = అపాయము కలుగును గదా; నీకు, మూర్ఖత = పెంకితనము, తగదు = కూడదు, పనికిరాదు.

తా. చెప్పకూడని విషయములను చెప్పవలసినదని భార్య భర్తను ఎన్నడును బాధించకూడదు. అందువలన కీడు కలుగును. మూర్ఖత తగదు.

క. పురుషుని వస్త్రము లెప్పుడును
మరపునైన గట్టవలదు మఱియమితముగా
చిరిగిన చీరెలు గట్టకు
కొరతవలువగట్టి తిరుగకూడదు సుదతీ. 49

టీ. సుదతీ, పురుషుని వస్త్రములు = మగవారి బట్టలను, ఎపుడును, మరపునైనన్ = మరచి (పరాకుపడి) యైనను, కట్టవలదు = కట్టుకొనగూడదు; మఱి, అమితముగా = ఎక్కువగ, చిరిగిన చీరెలున్ = చిరిగిన చీరెలను, కట్టకు = కట్టకుము; కొరతవలువన్ = చాలనిబట్టను, కట్టి = కట్టుకొని, తిరుగకూడదు.

తా. మరపుచేతనైనను పురుషులబట్టలను స్త్రీ లెప్పుడును కట్టుకొనరాదు. చిరిగిన చీరెలను, చాలని బట్టలను కట్టుకొని తిరుగరాదు.

క. మగఁడు ధనవంతుఁడైనను
నగలనడుగనేల నిచ్చు * నవరత్నంబుల్
మిగుల ధనహీనుఁడైనను
జగతిని నన్నమిడ మేలు సతతము సుదతీ. 50

టీ. సుదతీ, మగడు = భర్త, ధనవంతుఁడైనను = డబ్బున్నవాఁడైన యెడల, నగలనడుగనేల = నగలు తెచ్చి ఇమ్మని కోరుట ఎందుకు ? (కోర నక్కరలేదు); నవరత్నంబుల్ = నవరత్నములు, ఇచ్చున్ = ఇచ్చును; మిగుల = మిక్కిలి, ధనహీనుఁడైనన్ = డబ్బులేనివాఁడైనచో, సతతము = ఎల్లప్పుడును, జగతిని = భూమియందు, అన్నమిడన్ = అన్నము పెట్టి పోషించుటె, మేలు = మంచిది.

తా. భర్త డబ్బున్నవాఁడైయైన అడుగకయే నగలను ఇచ్చును. డబ్బు లేనివాఁడైన అన్నము పెట్టి భార్యను పోషించుటే మంచిది.

క. చిన్నతనంబున జనకుని
గన్నియ నీవయసునందు గాంతుని పిదపన్
బన్నిన వార్ధక్యంబున
గన్నసుతుల నాశ్రయింపగాదగు సుదతీ. 51

టీ. సుదతీ, కన్నియ = బాలా, చిన్నతనంబున = చిన్నదానవుగ ఉన్నప్పుడు, జనకునిన్ = తండ్రిని, నీవయసునందున్ = పెద్దదానవైనప్పుడు, కాంతునిన్ = భర్తను, పిదపన్ = ఆటుతర్వాత, బన్నినవార్ధక్యంబునన్ = ముసలితనము నందు, కన్నసుతులన్ = కుమారులను, ఆశ్రయింపగా దగున్ = ఆశ్రయింపవలెను.

---

* నవరత్నంబుల్, 1 వజ్రము 2 వైడూర్యము 3 గోమేధికము 4 పుష్యరాగము 5 మరకతము 6 మాణిక్యము 7 నీలము 8 ప్రవాళము 9 ముత్యము.

తా. బాల్యమున తండ్రిని, పెద్దదైన భర్తను, ముసలి తనమున పుత్రులను స్త్రీ ఆయాకాలములందు కనిపెట్టుకొని యుండవలయును.

క. సతి పతిని విడచి యుండిన
క్షితి నెంత సుశీలయైన కీర్తి బడయ దా
యతివ కనాశ్రయమగు లత
గతిశోభయు లేదు తెలియగాదగు సుమతీ. 52

టీ. సుమతీ, సతి = స్త్రీ, పతిని=భర్తను, విడచియుండిన=విడిచిపెట్టినచో, ఎంత సుశీలయైనన్=ఎన్ని మంచిగుణములుకలదైనను, క్షితిన్=భూమియందు, కీర్తి బడయదు= గౌరవమును పొందదు; ఆయతివకున్ = ఆ స్త్రీకి, అనాశ్రయమగులతగతిన్= ఆధారము లేని తీగవలె, శోభయున్= కాంతియును, లేదు; తెలియగాదగున్ = తెలిసికొనవలయును.

తా. మంచి గుణములు కలిగినను భర్తను విడచిన స్త్రీకి మర్యాద కలుగదు. తీగ ప్రాకుటకు ఆధారము ఒకటి ఉండవలయును. అప్పుడది అతి విశాలముగ ప్రాకి చూచిన ఆనందమును కలిగించును. ఆధారము లేని తీగ పడిపోవును. చూచువారు సంతోషింపరు. భర్తను వదలిన స్త్రీని అందరు తిట్టుదురు. వ్రాలిన తీగ వలె మంచిపేరు లేక చెడిపోవును.

క. పతి పనులయందు దాసీ
గతి శయ్యను రంభరీతి ఘన *మంత్రివలెన్
సతతంబాలోచనకును
పతి భుక్తికి తల్లిబోలి పరగును సుమతీ. 53

* మంత్రివలెన్:—రాజులకు ఆలోచన చెప్పుటకు మంత్రి యుండును. వారల చేతిలో రాజులు కీలుబొమ్మలవంటివారు. వారెట్లు చెప్పిన అట్లు చేయుదురు.

టీ. సుదతీ, పతిపనులయందు = భర్తచేయు పనులయందు, దాసీగతి = దాసివలెను, శయ్యన్ = పక్కయందు, రంభరీతి = రంభవలెను. (రంభచాలనందకత్తె) సతతంబున్ = ఎల్లప్పుడును, ఆలోచనకును = సలహా చెప్పుటకు, ఘనమంత్రివలెన్ = తెలివిగలమంత్రివలెను, పతిభుక్తికి = భర్త ఆహారమునుకోరినపుడు, *తల్లిబోలి = తల్లివలెను, పరగుము = ఉండుము.

తా. భర్తయెడల, పనులందు దాసివలెను, పక్కపై రంభవలెను, ఆలోచన చెప్పునప్పుడు మంత్రివలెను, అన్నముపెట్టునపుడు తల్లివలెను, భార్య నడచుకొనవలయును.

క. పరదేశమునకు నీధవు
డరిగినచో వానిరాక నరయుచునింటన్
పరిపరివిధముల సొగసుల
బరగక నీవుండు బీదపద్ధతిసుదతీ. 54

టీ. సుదతీ, నీధవుడు = నీభర్త, పరదేశమునకు = ఇతరదేశమునకు అరిగినచో = వెళ్లినచో, ఇంటన్ = ఇంటియందు, వానిరాకన్ = అభర్తవచ్చుటను గురించి, అరయుచున్ = విచారించుచు, పరిపరివిధముల = అనేకవిధములగు, సొగసులబరగక = అందములుచేయక, బీదపద్ధతి = బీదదానివలె, నీవు, ఉండు = ఉండుము.

తా. భర్త యితరదేశములకు వెళ్లినచో, అతనిరాకకు దినములు లెక్కించుచు అందముగనుండక బీదదానివలె ఉండవలయును.

క. అలుగకుమీ పతిమీదను
దెలుపకుమీ యింటిగుట్టు, దేవునికైనన్

* తల్లిబోలి: — లోకమున మాతృప్రేమను మించినవస్తువింకొకటి లేదు. తల్లి పెట్టునంటి దింకొకటి కాదు.

నిలువకుమీ పుట్టింటను
తొలఁగకుమీ నీవు నీతి త్రోవను సుదతీ. 55

టీ. సుదతీ *యింటిగుట్టున్ = యింటియందలి రహస్యమును, దేవుని కైనన్ = దేవునికైనను, తెలుపకుమీ = తెలుపవలదు; పుట్టింటను = పుట్టినయింటను, నిలువకుమీ = ఉండకూడదు; (స్త్రీలు తమ తల్లిదండ్రుల ఇండ్లయందు చాలకాలము ఉండుటకు ఇచ్చగింతురు, అట్లుచేయుట తగదు.) నీవు, నీతిత్రోవ = నీతిమార్గమును (మంచివృత్తినుంచి) తొలఁగకుమీ = తప్పవద్దుసుమీ.

తా. భర్తపై కోపింపకుము. ఇంటిలోని రహస్యములను దేవునికైనను తెలుపకుము, పుట్టింట చాలకాలము ఉండరాదు. మంచిమార్గమును వదలకుము.

క. మంచిగరపుటకు పతి బో
ధించిన నాపలుకులన్ని హితమని మదిలో
నుంచుము నేనెరుఁగనె యని
యెంచియు గోపించఁగూడ దెప్పుడును సుదతీ. 56

టీ. సుదతీ, మంచిగరపుటకు = నీతిమార్గమును తెలుపుటకు, పతి = భర్త, బోధించినన్ = చెప్పినట్లయిన, మదిలోన్ = మనస్సునందు, ఆపలుకులన్నియున్ = భర్త చెప్పినదంతయును, హితమని = మేలుకొఱకని, మదిలోన్ = మనస్సునందు, ఉంచుము = ఉంచుకొనవలయును; ఎప్పుడును, నేను, ఎరుఁగనె = తెలిసికొనలేదా! (తానిదివరకె ఎఱిగియున్నననుట) యని యెంచియున్ = తలఁచి, కోపించకూడదు = కోపముతగదు.

తా. భర్తబోధించువిషయములను తాను అంతకుమునుపె తెలిసికొంటినని భార్యచెప్పి, కోపించి, యెదురుపలుకుట కూడదు.

---

* యింటిగుట్టు:—'యింటిగుట్టు లంకకుచేటు' విభీషణుడు యింటగలగుట్టు తెలుపుటచేలక్ష్మణుడు ఇంద్రజిత్తుని తేలికగ జయించెను.

క. పడుచుదనంబున ముదిమిని
విడువక రక్షించుగాదె విభుసేవింపన్
చెడి బ్రతుకునట్టి వనితలు
పడుపాటులుచూడు వయసు బాసిన సుదతీ. 57

టీ. సుదతీ, విభుసేవింపన్=భర్తను ఆశ్రయించినచో, (భర్తకు కావలసిన పనులు చేసినట్లయిన) పడుచుదనమునన్ = యౌవనమునందును, ముదిమిని=ముసలితనమునందును, విడువక=వదలక, రక్షించుగాదె=పోషించును కదా! వయసుబాసినన్=తన పడుచుదనము చెడిన, చెడి=పాడయిపోయి, బ్రతుకునట్టి=జీవించునట్టి, వనితలు=స్త్రీలు, పడుపాటులు=పొందుచున్న కష్టములను, చూడు=చూడుము.

తా. భర్త అన్ని వేళల భార్యను పోషించును. తమ భర్తలను విడచిన స్త్రీలు పడు పాట్లను చూచియైన ఇతరులు తమ తమ భర్తలను వదలక యుండుట మంచిది.

క. నీపతి వృద్ధుండైనను
నోపిక నుపచారములను నొనరుచు
మెపుడున్ కోపముగూడ దసహ్యం
బేపట్టున దగదు దీని నెరుగుము సుదతీ. 58

టీ. సుదతీ, నీపతి=నీభర్త, వృద్ధుండైనను=ముసలివాడైనను, ఉపచారములన్= కావలసిన పనులను, ఓపికన్ = సహనముతో, ఎపుడున్, ఒనరుచుము = చేయుము; కోపము = కోపించుట, కూడదు = తగదు; ఏపట్టునన్ = ఏ సమయమునందును, (ఎప్పుడును) అసహ్యము = ఇష్టపడకుండుట, ఏవగించుట, తగదు=కూడదు; దీనిన్ = దీనిని, ఎరుగుము = తెలిసికొనుము.

తా. భర్త ముసలివాడైనను, ఓపిక తెచ్చుకొని కోపింపక మిక్కిలి ప్రేమతో స్త్రీలు ఉపచారములను చేయుచుండవలెను.

క. పుట్టింటివారు నీకును
పెట్టఁగలిగియున్న నీవు పెనిమిటితోడన్
గట్టిగ కలహంబాడియు
పుట్టింటికి చేర కీర్తి పొందవు సుదతీ. 59

టీ. సుదతీ, నీవు పెనిమిటితోడన్ = నీభర్తతో, గట్టిగ, కలహంబాడియు = పట్టుదలతో, పోరాడియు, పుట్టింటివారు, (తలిదండ్రులు) పెట్టఁగలిగియున్నన్ = పెట్టఁగలిగినను, పుట్టింటికి చేరన్ = తలిదండ్రుల యింటికి, వెళ్ళిన, కీర్తి బొందవు = గౌరవము తెచ్చుకొనవు.

తా. పుట్టింటివారు ఎంత పెట్టఁగలిగినవారైనను భర్తతో పోట్లాడి వారిండ్లకు వెళ్ళిన యెడల రానీయరు.

క. పుట్టుసొగసుండవలె మరి
బెట్టు నగలవలన కాంతి పెరుగదు భువిలో
చెట్టుపయి కాకిబరగునె
పట్టుకరంగులిడ చిలుక పద్ధతిసుదతీ. 60

టీ. సుదతీ, భువిలో = భూమియందు, పుట్టుసొగసుండవలె = పుట్టుకతోనె అందము కలుగవలెను; మరి, పెట్టు = పెట్టుకొనునట్టి, నగలవలన = నగలచే, కాంతి పెరుగదు = అందము హెచ్చదు; చెట్టుపయి కాకిన్ = చెట్టుమీదనుండు కాకిని, పట్టుక = పట్టుకొని, రంగులిడన్ = రంగులు వేయగా, చిలుకపద్ధతిని = చిలుకవలె, పరగునా = ఉండునా? (ఉండదనుట)

తా. కాకికి రంగుపూసినను చిలుక కానేరదు. అటులనే అందము పుట్టినప్పుడే కలుగవలయును గాని పెట్టుకొను నగలచే రాదు.

క. ధనవంతులైన వారల
గని వారికివలెను నీకు కనకాంబరముల్
గొనవలెనని పతిఁ బోరకు
ఘనమో స్వల్పంబో ధనము గనవలె సుదతీ. 61

టీ. సుదతీ; ధనవంతులైన వారలన్ = భాగ్యవంతులగువారిని, కని = చూచి, వారికివలెను = ఆవిధముగ వారి వలెను; నీకు, కనకాంబరముల్ = బంగారపు నగలను, ఖరీదుగల బట్టలను, కొనవలెనని = కొనవలసినదని, పతిన్ = భర్తను, పోరకు = బాధింపకు, ఘనమో = గొప్పగనో, స్వల్పంబో = కొలదిగనో, ధనమున్ = డబ్బును, కనవలెన్ = కూడబెట్ట వలయును.

తా. ధనవంతులగు వారలను చూచి వారివలె, తనకును, నగలు చేయించి యిమ్మని కోరుట స్త్రీకి తగదు. కొంచెముగాని, ఎక్కువగాని డబ్బును నిలువచేయ వలయును.

క. అప్పుగొనియైన నిప్పుడు
కొప్పుగొలుసులుట్లువచ్చె గొనుమనుచును నీ
వెప్పుడు జెప్పకు మిదియే
తప్పుగదవె ముప్పువచ్చు దానను సుదతీ. 62

టీ. సుదతీ, ఎపుడున్, కొప్పుగొలుసు లుట్లువచ్చెన్ = కొప్పుగొలుసులు, ఉట్లు, వచ్చినవి, అప్పుగొనియైనన్ = అప్పుచేసియైనను, ఇప్పుడు = ఇప్పుడే (నగలువచ్చినప్పుడు) కొనుమనుచున్ = కొనవలసిన దని, చెప్పకుము; ఇదియే = ఇట్లు చెప్పటయే, తప్పుగదవె = తప్పుసుమీ; దానను = ఆకారణమునను, ముప్పు = కీడు, వచ్చున్ = వచ్చును.

తా. కొప్పుగొలుసులు, ఉట్లు వచ్చినవి. అప్పుచేసి యిప్పుడే కొనవలసిన దని భర్తను స్త్రీ బాధించుట తగదు. అట్లు చెప్పిన కోపించును.

క. అరుగును నగ లనుదినమును
పెరుగును ఋణమనుచు నీవు బీదతనములో
నెఱుగుము భాగ్యము నీకును
తరుగక యున్నపుడు నగలు తగునిల సుదతీ. 63

టీ. సుదతీ, ఇలన్ = భూమియందు, బీదతనములోన్ = బీదతనమందు, నీవు, నగల్ = నగలు, అనుదినము = ప్రతిరోజును, అరుగును = అరుగుదలపొందును; (అరిగిపోవును) ఋణము = అప్పు, పెరుగును = ఎక్కువగును; అనుచున్ = అనుచును, ఎఱుగుము = తెలిసికొనుము; భాగ్యము = డబ్బు, తరుగక యున్నపుడు = ఖర్చుగాకుండి నప్పుడు, ఎక్కువగ నున్నప్పుడు, నగలు, తగున్ = నగలు, పెట్టుకొన వచ్చును.

తా. బీదరాలైన స్త్రీ నగలు అరుగుననియు అప్పుచేసిన ఋణము పెఱుగుననియు ఎఱుగవలెను. ధనికురాలయిన నగలు పెట్టుకొనవచ్చును.

క. పెరవారి నగల నెప్పుడును
నెరవుగ తెచ్చి ధరియించి యేగకుమచ్చో
బొరపాటున బోయినచో
పదిరెట్లీయవలయు దానికి సుదతీ. 64

టీ. సుదతీ, ధరన్ = భూమియందు, ఎపుడున్, పెరవారి నగల్ = ఇతరుల నగలను, ఎరవుగన్ = బదులుగ, తెచ్చి = తీసికొనివచ్చి, ధరించి = పెట్టుకొని, ఏగకుము = వెళ్ళకుము; ఎచ్చో = ఎచ్చటనైనను, పొరపాటున = మరపువే, పోయినచో = పోయినట్లయిన, దానికిన్ = ఆపోయిన నగలకై పదిరెట్లీయవలెన్ = తాము తెచ్చిన నగలకు పదిరెట్లు విలువనీయవలయును.

తా. ఎరువునగలు తెచ్చుకొనరాదు. ఒకవేళ అవి పోయినచో ఎక్కువ నష్టము కలుగును. సొమ్ము ఎక్కువగ ఈయవలయును.

క. తొత్తులతో సహవాసం
బుత్తమ వనితలకుఁగూడ దుర్వి నిజముగా
నెత్తైన మహిషితోకను
హత్తుక నట్టేటదిగిన నణపదె సుదతీ. 65

టీ. సుదతీ, నిజముగా = నిశ్చయముగా, ఉర్విన్ = భూమియందు, ఉత్తమవనితలకు = మంచి స్త్రీలకు, తొత్తులతో = చెడు స్త్రీలతో, సహవాసంబు = చెలిమి, స్నేహము, కూడదు = తగదు; ఎత్తైనమహిషితోకన్ = ఎత్తుగా నున్నట్టి గేదెతోకను, హత్తుక = పట్టుకొని, నట్టేటదిగఁగా = ఏటి నడుమ (ప్రవాహమధ్యమున) దిగిన యెడల, అణపదె = ముంచివేయదా? (ముంచివేయును.)

తా. ఎత్తైన గేదెతోకను పట్టుకొని నట్టేటదిగినయెడల ముంచును. అట్లే మంచివారు చెడుస్త్రీలతో స్నేహముచేసిన నట్టేట మునిగినవాని వలె చెడిపోవుదురు. (ఉత్తమస్త్రీ గేదెతోకను పట్టుకొనువానికిని చెడు స్త్రీ గేదెకునుపోలిక).

క. పరపురుషునితో నొంటిగ
తరుణవయసునందు నీవు తరుచుగ మాటల్
జరిపిన యెడలను జూచిన
గరితలచే నీకు వాదుగలదిల సుదతీ. 66

టీ. సుదతీ, ఇలన్ = భూమియందు, తరుణవయసునందు = యౌవ్వనమునందు (యుక్తవయసునందు), నీవు, ఒంటిగన్ = ఒంటరిగ తరుచుగ = అనేక పర్యాయములు, పరపురుషునితోన్ = ఇతరపురుషునితో, మాటల్ = మాటలను, జరిపిన యెడలను = మాట్లాడినచో, నీకు, చూచిన గరితలచేన్ = అట్లుమాట్లాడు నప్పుడు చూచిన స్త్రీలచే, వాదు = అపవాద, నింద, గలదు.

తా. యుక్తవయస్సున స్త్రీ యితర పురుషులతో మాట్లాడుట స్త్రీ లెవరైన చూచిన గేలిచేయుదురు.

క. పరపురుషులతో నెపుడును
సరసములాడకుము వారు సతి వాక్యంబుల్
కరమనురాగ యుతములని
మదిదలంచెదరమ్మ మోహమగ్నత సుదతీ. 67

టీ. సుదతీ, ఎప్పుడును, పరపురుషునితోన్ = ఇతరునితో, సరసములాడకుము = వేళాకోళము (పరిహాసము) చేయకుము, వరుసలాడకుము; వారు = అట్లుమాటలాడు పురుషులు, మోహమగ్నతన్ = మోహముచే, సతివాక్యంబుల్ = స్త్రీలవాక్యములు, కరము = మిక్కిలి అనురాగయుతము లని = ప్రేమతోఁగూడి యుండునని, మదిన్ = మనస్సునందు, తలచెదరు అమ్మ = తలఁతురు.

తా. ఇతరపురుషులతో మాటలాడకుము. స్త్రీలు మాటలాడినపురుషులు మోహపరవశులై ఆ మాటలను హితముగ తలచెదరు.

క. పరపురుషుఁడు చెడుగైనను
పరిపరివిధములను దానె భాషించుజుమీ
పెరవారలతో మాటలు
పరపురుషులకేల మరలి పదండనుసుదతీ. 68

టీ. సుదతీ, పరపురుషుఁడు = ఇతరుఁడు, (మనుష్యుఁడు) చెడుగైనను = చెడుబుద్ధి గలవాఁడైనయెడల, తానె = తానే. (తనంతటతానె) పరిపరివిధములను = అనేక విధములుగ (స్త్రీలను వశపరచుకొనుటకు) భాషించుజుమీ = మాటలాడునుసుమీ! పురుషులకు = మగవారలకు, పెరవారలతో = ఇతర స్త్రీలతో, మాటలు = పలుకులు, ఏల = ఎందుకు? మరలి = మరలి, వచ్చినటుల తిరిగి, పదండను = వెళ్ళవలసినదని చెప్పుము.

తా. చెడుబుద్ధిగలవాఁడు తనంతటదానె ఇతర స్త్రీలతో సంభాషించును. ఇతర స్త్రీలతో తమకేమిపనియని మరలిపొమ్మని చెప్పవలయును.

క. శుచిగా నుండుము వంటయు
రుచిగాఁ జేయుటకుఁ బాకరూఢి దెలియుమా
పచనము జేయక పెట్టిన
కచికచి వేయుదురు సురుచిగా దది సుదతీ. 69

టీ. సుదతీ, శుచిగాన్ = శుభ్రముగాను, ఉండుము = ఉండవలసినది; వంటయు, రుచిగాఁజేయుటకు = రుచికలిగి యుండునట్లుచేయుటకు, పాకరూఢి = వంటచేయువిధము (పాకశాస్త్రము) తెలియుమా = తెలిసికొనవలసినది; పచనమున్, చేయక = చక్కగావండక, పెట్టినన్ = పెట్టినచో, కచికచివేయుదురు = నమలక పారవేయుదురు; అది = ఆపాకము, అట్టివంట, సురుచిగాదు = రుచిగానుండదు.

తా. శుభ్రముగా నుండుము. వంటచేయుట తెలిసికొనుము. బాగుగ నుడికించకపోయిన రుచి చెడును. తినక పారవేయుదురు.

క. ఆపదయం దతిదుఃఖము
నోపక సంపదల మిగుల నుత్సాహము నీ
వేపట్టున గనుపరుపకు
మాపరమాత్ముండె యొసగు నది యిదిసుదతీ. 70

టీ. సుదతీ, ఆపదయందు = కష్టము కలిగినప్పుడు, ఓపక = సహింపక, అతిదుఃఖము = మిక్కిలివిచారమును, సంపదలన్ = సొమ్ముకలిగినప్పుడు, మిగుల నుత్సాహమున్ = ఎక్కువగు సంతోషమును, నీవు, ఏపట్టునన్ = ఏసమయమందైనను, (కష్టసుఖములందు, 'కలిమిలేములు కావడికుండలు') కనుపరుపకుము = చూపకుము; అది = ఆకష్టము, ఇది = ఈసుఖము, ఆపరమాత్ముండె = ఆదేవుడె, ఒసగున్ = ఇచ్చును.

తా. కష్టము కలిగినపుడు దుఃఖించుట, సుఖము కలిగినప్పుడు సంతోషించుటయును తగదు. ఏలయన, ఆరెంటిని దేవుడే కలిగించును.

క. ఇరుగు పొరుగిండ్ల వారలు
అరుగుగ స్వల్పముగ నప్పు నడిగిన నిమ్మా
ధర నేమి గలిగియుండిన
కొరత యదియొకండు తెలిసికొనుమీ సుదతీ. 71

టీ. సుదతీ, ఇరుగుపొరుగిండ్లవారలు=తనయింటికి చుట్టుప్రక్కలనుండు వారు, అరుగుగ=ఎప్పుడో ఒకప్పుడు, స్వల్పముగ=కొంచెముగ, నప్పు=అప్పుగా, అడిగిన=అడిగినచో, ఇమ్మా=ఈయుము, ధరన్=భూమియందు (ఇంటియందు) ఏమిగలిగియుండిన=అనేక వస్తువులున్నను, ఏదియొ=ఏవస్తువో ఒక వస్తువు లేని, కొరత=లోపము, ఉండును, అని, తెలిసికొనుము=తెలిసికొనవలయును.

తా. ప్రక్కయింటివారు ఏవస్తువైనను చేబదులడిగిన కలిగి ఉన్నదానిలో లోటు లేక ఇమ్ము. ఏలయన ఎన్నివస్తువులు కలిగియున్నను ఇంకను కావలసిన వస్తువులెన్నియో ఉండునని తెలిసికొనుము.

క. కోడలవై యున్నప్పుడు
చేడె నీ యత్తగారి జెడనాడకుమీ
చూడగ కొన్నాళ్ళకు
నీకోడలికి నత్తవగుదు వనుకొనవలె సుదతీ. 72

టీ. సుదతీ, చేడెరో=ఓ స్త్రీ, కోడలవై యున్నప్పుడు=నీవు ఒకరికోడలుగ నున్నపుడు, నీయత్తగారిన్=నీఅత్తగారిని, (భర్త తల్లిని) చెడనాడకుమీ=కఠినపు మాటలు పలుకకుము; చూడగన్=చూడగా, విచారించగ, కొన్నాళ్ళకు=కొన్ని రోజులకు, నీకోడలకు, అత్తవు, అగుదున్=అగుదువని, అనుకొనవలెన్=అనుకొనవలయును. (తలచుము.)

తా. కోడలుగనున్న స్త్రీ తన అత్తగారిని చెడనాడరాదు. ఒకప్పుడు తానుగూడ అత్తయగును. అప్పుడు కోడండ్రనిన మాటలకు తనకు నొప్పి

కలుగును (మనస్సు బాధించును). కావున స్త్రీ) లందఱును అత్తలను బాధింపక నడచుకొనవలయును.

క. అత్తను నేనను గర్వము
చిత్తంబున నుంచి బుద్ధిచెడి కోడండ్రన్
మొత్తకు నీకూతురు
చేపతి ంటికిబోవ దెప్పరట వే సుదతీ. 73

టీ. సుదతీ, నేను, అత్తను, అను = అనునటువంటి, గర్వము = మనము అత్తలము అను అధికారము, చిత్తంబున = మనస్సున, ఉంచి, బుద్ధిచెడి = చెడుమనస్సుగలదానవై, కోడండ్రన్, మొత్తకు = బాధింపకుము; నీకూతురు, రేపు = ముందు, అత్తింటికిబోవన = అత్తగారింటికి వెళ్ళిన, దెప్పరటవే = నిందింపరా ? (నిందింతురు).

తా. అత్తవై యుండునపుడు నీ కోడళ్ళను బాధింపరాదు. ఏలయన నీకూతుళ్ళను గూడ వారి యత్తలు కొట్టినను, తిట్టినను, నీకట్టిబాధ కలుగునో ఆలోచించి, కోడళ్ళను కష్టపెట్టకుండుట మంచిది. (కోడలు = కుమారుని పెండ్లాము).

క. వృద్ధులగు నత్తమామల
శ్రద్ధగ బోషింపుమమ్మ చానరో నీవున్
వృద్ధవగుదపుడు నీస్నుమ
బుద్ధి గలిగి జూడవలదె పుడమిని సుదతీ. 74

టీ. సుదతీ, చానరో = ఓస్త్రీ, వృద్ధులగు = ముసలివారగు, అత్తమామలన్ = అత్తగారిని, మామగారిని, శ్రద్ధగన్ = మిక్కిలిఓర్పు గలిగి, పోషింపుమమ్మ = సేవింపుము (ఉపచారముచేయుము); ఎందుకన, నీవున్, వృద్ధవగుదపుడు = ముసలిదానవుఅగు నపుడు, పుడమిని = భూమి

యందు, నీస్నుష = నీకోడలును, బుద్ధిగలిగి = తెలివిగలదై, (మంచిదై) చూడవలదె = చూడవలదా ? (చూడవలెను.)

తా. మునుఁగలకు అత్తమామలను ప్రీతిం బూజింప వలయును. ముందు తాము ముసలివారైన తమ కోడండ్రు తమకు ఉపచారము చేయ వలదా? (చేయవలయును). తమకు కోడండ్రు చేయవలెను తాము చేయించు కొనవలెనను కోరిక గలిగి యుండును. కావున తాము అత్తలను సేవింప వలయును.

క. పెట్టిన వారికి నెల్లను
బుట్టుటయే సాక్షియనఁగ భువిలో వినవే
పట్టేల పేదలను గని
పెట్టుము నీకున్నరీతి ప్రీతిగ సుదతీ. 75

టీ. సుదతీ, భువిలోన్ = భూమియందు, ఎప్పుడున్, పెట్టినవారికిన్ = ఒకరికి ఇచ్చినవారికి, పుట్టుటయే = మరల తమకు కావలసినప్పుడు తెచ్చుకొనుటకు ఆధారముకలిగి యుండుటే, సాక్షియనఁగన్ = సాక్షివలెనుండు నను యంశము (ఒకరికిచ్చిన తనకును పుట్టును లేవిచో లేనిదగును.) వినవే = వినవా ? నీకున్నరీతిన్ = నీకు కలిగిన దానిలో, ప్రీతిగన్ = దయగలదానివై, (ప్రేమతో) బీదలను = పేదవారిని, (దరిద్రులను) కని పెట్టుము = పోషింపుము; పట్టేల = బీదవారితో నీకు పంతమెందుకు ?

తా. ఎల్లప్పుడు ఇతరులకు దానముచేసిన ఆదానము చేసిన వారికి అన్ని సంపదలు దేవుడు కలుగజేయును. కావున బీదసాదలను ఆదరించ వలయును.

క. తీరిక యుండిన వేళల
నూరక గూర్చుండి యందనూరి చెనగులన్

నోరూర జెప్పుకొనకను
కోరిక సత్కథలు చెప్పుకొనవలె సుదతీ. 76

టీ. సుదతీ, తీరికయుండిన వేళలన్ = పనిలేనప్పుడు, అందరు = స్త్రీలందరును, ఊరకన్ = ఊరకే (పనిలేక) కూర్చుండి, అందరి = అందరి యొక్క, ఊరిచెడుగులన్ = ఊరిలోని మంచిచెడ్డలను, నోరూరన్ = నోటియందు ఊటలు ఊరునట్లు, చెప్పుకొనకను = చెప్పుకొనకుండ, కోరిక = ఉత్సాహముతో, వేడుకతో, సత్కథలు = పుణ్యకథలు, (రాముని, కృష్ణుని మొదలైన వారినిగూర్చి) చెప్పుకొనవలెన్ = చెప్పుకొనవలయును.

తా. గ్రామములోని స్త్రీలందరు ఒకచోట గూడి ఊరియందలి మంచి చెడుగుల చెప్పుకొనుచు వృథాగా కాలము వెళ్ళదీయరాదు. మంచిమంచి పురాణ కథలను చెప్పుకొనవలయును.

క. * బొట్టెల్లప్పుడు మోమున
బెట్టుము పదిమంది యెదుట బిడియము లేకన్
దిట్టవయి పలుకకుము పతి
దిట్టగ నేమనిన నిన్ను దిరముగ సుదతీ. 77

టీ. సుదతీ, మోమునన్ = మొగమునందు, ఎల్లప్పుడు, బొట్టు = తిలకము, పెట్టుము; పదిమంది యెదుటన్ = పెద్దమనుష్యులున్న సభలలో, బిడియము లేకన్ = సిగ్గువిడిచిన దానవై, దిట్టవయి = గర్వముగల దానవై, పలుకకుము = మాట్లాడకుము; తిరముగన్ = స్థిరముగ, నిన్ను, పతి = భర్త ఏమనినన్ = ఏమనినను (తిట్టినను, కొట్టినను) తిట్టకుము = తిట్టవలదు.

---

* బొట్టు:—ఇది స్త్రీలకు ఐశ్వర్యము కలిగించును. బొట్టుండిన అందము ఇచ్చును. స్త్రీలకు విధవతనమునకు గుర్తు. భర్తగలవారు పెట్టుకొనవలయును.

తా. స్త్రీ బొట్టుపెట్టుకొనవలయును. అందరిలో జంకు లేక మాట్లాడరాదు. భర్త తన్ను కొట్టినను, తిట్టినను, ఏమియు ననగూడదు.

క. బావలు మఱఁదులు పెద్దలు
త్రోవను నెదురైన నీవె తొలఁగుము వారిన్
నీవెపుడు నెదిరి పలుకకు
మేవేళ బండబోకు మెదుటను సుదతీ. 78

టీ. సుదతీ, బావలు = భర్త అన్నలు, మఱఁదులు = భర్త తమ్ములు, పెద్దలు = తనకంటె వయసున పెద్దవారలు, త్రోవనున్ = త్రోవయందు, ఎదురైనన్ = ఎదురైనచో, నీవె = నీవే, తొలఁగుము = తప్పుకొనుము; (వారు తప్పుకొనుటకు మున్నె నీవె తప్పుకొనవలయును) వారిన్ = బావలు, మఱఁదులు, పెద్దలు మొదలగువారిని. నీవెపుడున్ = నీవు ఎప్పుడును, ఎదిరి = ఎదుర్కొని, తెగబడి పలుకకుము = మాట్లాడకుము; వారి ఎదుటను, ఏవేళన్ = ఏసమయమందైనను, పండబోకుము = నిద్రించుట గాని, పడుకొనుట కాని తగదు.

తా. స్త్రీలు, తమ బావలు, మఱఁదులు, పెద్దమనుష్యులును ఎదురుపడినపుడు తప్పుకొనవలయును. తెగబడి మాట్లాడరాదు. వారు తిరుగు చోటుల యందు నిద్రించుట గాని పండుకొనుటగాని తగదు.

క. గుణవతి యనుపించుకొనను
గణుతింపక సాధ్వి చాల కాలముపట్టున్
తృణమాత్రము లోపమున స
ద్గుణమెల్ల నశించి కీర్తి తొలగును సుదతీ. 79

టీ. సుదతీ, సాధ్వి = స్త్రీ, గుణవతి యనుపించుటకును = మంచి గుణము కలదనిపించుకొనుటకు, చాలకాలము = ఎక్కువకాలము, గణుతింపక = లెక్కపెట్ట నవసరములేకయే, పట్టున్ = పట్టును; సద్గుణమె

ల్లన్ = మంచిగుణ మంతయు, క్షణమాత్రములోపలన్ = నిమిషమైనను పట్టకయే, (నిమిషము = గంటలో 60 వంతు; 60 రెప్పపాటుల కాలము). నశించి = చెడిపోయి, కీర్తిగోలన్ = మంచిపేరు మాసిపోవును.

తా. మంచివానవనుపించుకొనుటకు చాల కాలము పట్టును. అట్లు సంపాదించిన గొప్పతనము నిమిషమాత్రములో పోయి వెనుకటి మంచి పేరును పోగొట్టును.

క. సంపదయు సుస్థిరంబని
యింపుగ పలుకంగ గూడ దిలవానలలోన్
తెంపుగ బలికెడు కప్పలు
రొంపి నణగు * గ్రీష్మమందు రూఢిగ సుదతీ. 80

టీ. సుదతీ, ఇలన్ = భూమియందు, సంపదయె = ఐశ్వర్యమె, ధనమె, సుస్థిరమని = నిలుచునని, యింపుగన్ = గర్వముగ. పలుకంగగూడదు = పలుకుటతగదు (బడాయిగ మాట్లాడరాదు); వానలలోనన్ = వర్షములు కురియునప్పుడు, తెంపుగ బలికెడు = కంఠము విప్పి బిగ్గరగ అరచెడి, కప్పలు, రూఢిగన్ = నిజముగ, గ్రీష్మమందు = గ్రీష్మఋతువునందు, రొంపి నణగున్ = బురదలో అణగిపోయినవై అరవలేవు.

తా. ఐశ్వర్యము గలవారమని ఇతరులతో బడాయిగ మాట్లాడరాదు. వర్షకాలములో అరచు కప్ప గ్రీష్మఋతువున అరవనేరదు.

ఐశ్వర్యము వర్షకాలములో అరచు కప్పకును } పోల్పబడినవి.
దరిద్రము గ్రీష్మఋతువునందలి కప్పస్థితికిని }

---

* గ్రీష్మము:— ఇది ఆరు ఋతువులలో ఒకటి. ఋతువనగ రెండుమాసముల కాలము. సంవత్సరమునకు 12 మాసములు. 6 ఋతువులు. శ్రావణ భాద్రపదమాసములు వర్షఋతువు. జ్యేష్ఠ ఆషాఢమాసములు గ్రీష్మఋతువు. ఈ కాలమున ఎండలు మెండుగ కాయును.

క. ఏకాంతపు మాటలునీ
వేకాంతలకైన దెలియ నీయకు మప్పే
లోకాంతమునకు నేగును
శ్రీకాంతుని సాక్షిగాను సిద్ధము సుదతీ 81

టీ. సుదతీ, ఏకాంతపు = రహస్యపు, మాటలు, నీవు, ఏకాంతలకైనన్ = ఏ స్త్రీలకైనను, తెలియనీయకుము = తెలియపరచకుము; అప్పే = అవి మాటలనే, లోకాంతమునకు = అందరి చెవులకును, శ్రీ=లక్ష్మీ; కాంతుని = భర్తను, (అనగా విష్ణువుని) సాక్షిగన్ = సాక్షిగా, ఏగును = వెళ్ళును; సిద్ధము = నిశ్చయము

తా. ఏరహస్యమైనను ఒకరికి చెప్పిన లోకమంతయును వెల్లడి అగును. అట్లు చేసిన రహస్యము దాగదు.

క. చేసియు జేయనకెప్పుడును
మోసము వాటిల్లుదాన ముద్దులగుమ్మా
రోసము వలదెప్పటికిని
దోసపు కార్యములనుండి తొలగుము సుదతీ. 82

టీ. సుదతీ, ముద్దులగుమ్మా, ఎప్పుడును, చేసియు = తప్పుపనిగాని లేక మంచిపనిగాని చేసినయెడల, చేయనక = చేయలేదని చెప్పకుము; దానన్ = అట్లు చెప్పుటచేత (చేసియు చేసినట్లు చెప్పకపోయిన) మోసము = కీడు, వాటిల్లున్ = కలుగును; ఎప్పటికిని, రోసము = కోపము, వలదు = తగదు; దోసపు కార్యములనుండి = పాపపు పనులనుండి, తొలగుము.

తా. చేసినపనిని ఒప్పుకొనవలయును. లేనిచో చెరుపుకలుగును. చెడుపనులనుండి మరలుము. రోసము తగదు. మంచిపనులను చేయుము.

క. పతిబంధువు నీబంధుల
మతిలో నొకరీతిజూడ మర్యాదసుమీ

క్షితిజేసి పక్షపాతము
కుతుకమ్మున మీఁదఫలము గుడుతురు సుదతీ. 83

టీ. సుదతీ, మతిలోఁ = మనస్సునందు, పతిబంధులన్ = భర్తవైపు చుట్టములను, ఒకేరీతిఁ = ఒకేవిధముగా, చూడఁ = చూచుట, మర్యాదసుమీ = మర్యాద (గౌరవము)గ నుండును; క్షితిన్ = భూమియందు. పక్షపాతము = ఒకరియం దభిమానము, కుతుకమ్మునన్ = వేడుకతో, చేసి = చూపిన, మీఁదఫలమున్ = తరువాత గానున్నదానిని, కుడుతురు = అనుభవింతురు.

తా. భర్తవైపు చుట్టములను, తనవైపువారిని సమముగనే స్త్రీ మర్యాద చేయవలయును. ఒకవేళ తనవైపువారిని ఎక్కువ ప్రేమతో చూచిన రాఁగల ఆపదను కాచుకొని యుండవలయును.

క. నీయింటి తగవులను నీ
వేయింటను దెల్పబోకు మెప్పుడు వారల్
వేయివిధంబుల వీధికి
దీయఁగ జూచెదరు నిన్ను తిరముగ సుదతీ. 84

టీ. సుదతీ, నీవు, నీయింటితగవులను = నీ ఇంటిలోని తగాయిదాలను, ఎప్పుడు, ఏయింటను = ఎవరియింటియందును, (ఏ స్త్రీలతోనైనను, ఇల్లు స్త్రీకి బదులుగ వాడబడినది.) తెల్పన్ = తెలుపుటకు, పోకుము = వెళ్ళకుము; వారల్ = ఆ స్త్రీలు, వేయివిధంబులన్ = అనేక ఉపాయములచేత, నిన్ను, తిరముగన్ = నిశ్చయముగ, వీధికిన్ = రచ్చకు, తీయఁగన్ = లాగుటకు, చూచెదరు = ప్రయత్నించెదరు.

తా. నీయింటగల గుట్టును ఇతర స్త్రీలకు చెప్పిన నిన్ను రచ్చకీడ్చుటకు ఆలోచించెదరు. కాబట్టి అట్టి స్త్రీలకు చెప్పకుండుటె శిక్ష.

క. నీయున్నదమ్ములను మరి
బాయక నీవుంటివేని ప్రాణంబులు వే

బాయుదు ననుమను పతితో
నీయుర్విని బోరు ధూర్తయోపుదురు సుదతీ. 85

టీ. సుదతీ, ధూర్త = కోపస్వభావురాలు, పతితోన్ = భర్తతో, నీయన్నదమ్ములను = నీయన్నలను, తమ్ములను, మరి = ఇంకను, పాయక = వదలక, నీవు, వుంటివేనిన్ = వున్నయెడల, ప్రాణంబులున్ = జీవములును, పోవాయను ననుచును = వెంటనే చచ్చిపోవుదును అని చెప్పుచు, ఈయుర్విని = ఈభూమియందు, ఎప్పుడును, పోరున్ = తగవులాడును.

తా. కోపస్వభావముగల స్త్రీ తనభర్త, అన్నదమ్ములతో కలసి వున్నయెడల ప్రాణములు పోగొట్టుకొందునని చెప్పి గోలచేయును.

క. చేతులు చాచుచు కొందరు
నీతి తొలగి వీధిలోన నిలుచియు నొకటే
రీతిని తిట్టుచు బోదురు
ఆతరుణులు భువిని నసుర లనదగు సుదతీ. 86

టీ. సుదతీ, చేతులు చాచుచు = చేతులు జాపి, కొందరు = కొంతమంది స్త్రీలు, నీతితొలగి = చెడువారలై, వీధిలోన నిలచియున్ = నలుగురు తిరుగు ప్రదేశములో నిలుచుండి, ఒకటేరీతిన్ = ఎడతెరపిలేక, ఒకే విధముగ, తిట్టుచుబోదురు = తిట్టుచు వెళ్ళుచుందురు; (ఓడియము లేక బజారులయందు అరచుచుందురు.) ఆతరుణులు = అట్టి స్త్రీలు, భువినిన్ = భూమియందు, అసురలు = రాక్షసులని, అనదగున్ = అనుట తగును, (చెల్లును.) అట్టి స్త్రీలను రాక్షసులని చెప్పవచ్చును.

తా. కొందరు స్త్రీలు, సిగ్గువిడియములు లేక, చేతులు బారలుతిప్పుకొనుచు బాజారులలో అరచుచు నోటికవచ్చినట్లు ప్రేలుదురు. అట్టివారు రాక్షసులు.

క. కొందరు కోవనతెరుగక
తొందరపడి నూతిలోన దుమికి మనసునన్

సుందరులందరు దుర్మతు
లెందును ననుచుంద్రు పురుషులిలలో సుదతీ. 87

టీ. సుదతీ, కొందరు = కొందరు స్త్రీలు, కోపవశరుగక = కోపముచే ఒళ్ళు తెలియక, తొందరపడి = త్వరపడి, నూతిలోనఁ = నూతియందు, దుమికి = దూకి, వడియుటఁ = ప్రాణములు పోగొట్టుకొనుటచే, యిలలోఁ = భూమియందు, పురుషులు = మగవారలు, యెంగును = యొక్కడైనను, సుందరులందరు = స్త్రీలందరు, దుర్మతులు = చెడుబుద్ధిగలవారని, అనుచుంద్రు = అనుచుందురు.

తా. కొందరు స్త్రీలు ఒళ్ళుపై తెలియక నూతిలోబడి ప్రాణముల వదలుదురు. అట్లు పడు స్త్రీలనుచూచి, స్త్రీలందరును చెడ్డవారని పురుషులు నొక్కిపలికెదరు.

క. ఇరుగు పొరుగిండ్లవారినొ
మరదినొ బావలనొ లేక మామనొ పతినో
నిరతము దూషింతురు కొం
దరు తరుణులు మంచి చెడుగు దలపరు సుదతీ. 88

టీ. సుదతీ, కొందరు, తరుణులు = స్త్రీలు, ఇరుగుపొరుగిండ్లవారినొ = చుట్టు ప్రక్కలయిండ్లలో నున్నవారినొ, మరదినొ, బావలనొ, లేక = వారినికాక, మామనొ = భర్తతండ్రినో, పతినో = భర్తనో, నిరతము = ఎల్లప్పుడు, దూషింతురు = తిట్టుదురు; కొందరు తరుణులు, మంచి చెడుగులు = మంచిచెడ్డలు, తలపరు = ఆలోచింపరు.

తా. స్త్రీలు మంచిచెడుగుల తెలిసికొన లేక నోటికివచ్చినటుల ప్రతివారిని తిట్టుదురు.

క. పొరుపెరుగక యుండినచో
బరిపరి విధములను సుగుణభాగ్యయనంగా

సరి గరితలలో నెగడెదు
ధరఁ బోరువే నష్టమనుచుఁ దలఁచుము సుదతీ. 89

టీ. సుదతీ, పోరువెరుగక = జగడమాడుట ఎట్టిదో ఎరుగక, (పోరుపు = గిట్టకుండుట) ఉండినచో = ఉన్నయెడల, పరిపరివిధములను = అనేక విధములను, సరిగరితలలో = సాటి స్త్రీలలో, సుగుణ = మంచి గుణములలో, భాగ్య = కూడుకొని యున్నదని, అనంగా = అనగా, నెగడుదువు = లెక్కింపబడుదువు; ధరన్ = భూమియందు, పోరువే = జగడమాడు స్వభావము గలిగియుండుటే, నష్టమనుచు = కీడు అనుచును, తలచుము = తలపుము.

తా. జగడమాడుట యెరుగని స్త్రీని మంచి దానినిగ లెక్కపెట్టెదరు. పోట్లాడువారనేక లాభములను పోగొట్టుకొందురు. అల్లరి పడుదురు. అపవాదు కలుగును

క. నీనడవడి చెడుగైనను
చానరొ తలిదండ్రులకును సహజులకెల్లన్
మానని యవమానముగద
దీని దెలిసి మెలగుమమ్మ తిరముగ సుదతీ. 90

టీ. సుదతీ, చానరో = ఓ స్త్రీ, నీనడవడి = నీ ప్రవర్తన, చెడుగైనను = మంచిదిగాని యెడల, తలిదండ్రులకును, సహజులకును = తోబుట్టువులకును, (సహ = కూడ, జ = పుట్టిన, తోడబుట్టిన) అనగా అప్పచెల్లెండ్రకు, అన్నదమ్ములకు, ఇతర చుట్టములకును, మానని = నశింపని, యవమానముగద = అపనిందగదా! (తలవంపులు గదా?) తిరముగన్ = స్థిరముగా, దీనిన్ = ఈ విషయమును, తెలిసి = గుర్తెరిగి, మెలగుమమ్మ = తిరుగవలసినది.

తా. నీ నడవడి మంచిదిగాక పోయిన నీవారలును చుట్టములును నిందపాలగుదురు. ఈ విషయము గమనించి తిరుగవలయును.

క. వాకిలి యనగా నెరుగక
లోకుల కగుపడక యెప్పుడు లోగిటనున్నన్
ఆకలికికి గుణసంపద
లేకున్నను లేదు యశము లేశము సుదతీ. 91

టీ. సుదతీ, వాకిలి = వీధి గుమ్మము, అనగా, నెరుగక = తెలి యక, (వీధిగుమ్మమెట్లుండునో తెలియని స్త్రీ) వీధిగుమ్మము తొక్కని స్త్రీ) లోకులకు = ఇతర జనులకు, అగుపడగ = కనుపించక, ఎపుడు, లోగి టనున్నన్ = ఇంటిలోపలిభాగమున ఉన్నప్పటికిని, ఆకలికి = ఆ స్త్రీకి, గుణసంపద = మంచి గుణములు, లేకున్నను = లేకపోయినను, లేశము = కొంచెమైనను, యశము = గౌరవము, లేదు.

తా. ఎల్లప్పుడు యింట్లోనుంచి బైటకురాకున్నను, నడవడి మం చిది గాని స్త్రీని గౌరవింపరు. కీర్తి తొలగును మర్యాద పోవును.

క. దారిద్ర్యమునను చౌర్యము
మారి యెప్పుడు జేయకు మారి మిగుల దలచుమా
కోరి * కుచేలున కీడే
సారసలోచనుడు సకల సంపద సుదతీ. 92

టీ. సుదతీ; దారిద్ర్యమునను = బీదతనము నందును, మారి =

1 కుచేలుడు:— కృష్ణుని స్నేహితుడు ఇరువురును సాందీపుని యొద్ద చదువుకొనిరి. కుచేలుని భార్య వామాక్షి, వారికి సంతానము చాల కలదు. బీదలగుటచే, పిల్లలందరికి ఆమె అన్నము పెట్టలేకుండెను. ఆమె ఉపవాసముండి పిల్లల పొట్ట నింపుచుండెడిది చూచితిరా ఈమె సౌశీ ల్యము!
ఒకనాడామెభర్తను శ్రీకృష్ణుని దర్శింప ప్రోత్సహించి, కొన్ని యటుకు లను ఆ భగవంతునకు కానుకగ సమర్పించుటకు ఇచ్చి, ద్వారకకు పంపెను.

నడచుకొన వలసినరీతిని నడచుకొనక, ఎపుడున్, చౌర్యము = దొంగ తనము, చేయక; మిగులన్ = మిక్కిలి, హరిన్ = హరిని, దేవుని, తల చుమా = తలపవలయునుసుమా; * సారసలోచనుడు = కృష్ణుడు, శౌరి = ఇశ్వరుఁడు; కుచేలునకు, సకలసంపద = సమస్తైశ్వర్యమును, ఈడే = ఈయ లేదా (ఇచ్చెనుకదా).

తా. జీవితమును వంచైనను దొంగతనమూ పనికిరాదు. దేవుని ప్రతి గాలను ధ్యానింపుము. భక్తుడగు కుచేలునకు అన్నిసంపదలను శ్రీకృష్ణుడు ఇచ్చెను.

క. ధనమును సంతతి కలిగిన
వనితలుగని మనసున్నైన వగవకు మోహమున్
* వనజభవు డెట్లు వ్రాసెను
గనుగొనుమా మంచిచెడుగు గలుగును సుమతీ. 93

కుచేలుని రాకకు కృష్ణుడు మిక్కిలి సంతోషించి అనేక విధ ముల పూజించి, గౌరవించి, మరుసటి ఉదయమున తిరిగి పంపెను. అత నికి సొమ్ము యియ్యలేదు. ధనమదముచే దేవునియందుగల భక్తి నశించు నను ఉద్దేశ్యముతో, తనకు సంపదలు కలిగింపనందులకు కుచేలుడు సంతసించెను. కంటిరా! కుచేలునిసంతృప్తి. కాని భగవంతునకు ఆయ నయం దనుగ్రహము లేకపోలేదు. మార్గమున కుచేలుని రూపము మార్పు చెందెను. భార్య సేవకులతో వచ్చి, యాదరించి, భగవన్నిర్మితమగు గృహ మునకు తీసికొని పోయెను. భక్తులయెడకృష్ణునకుగల యాదరణమిట్టిది.

* సారసలోచనుడు, తామర రేకులవంటి కన్నులు గలవాడు దేవుడు.

* వనజభవుడు = బ్రహ్మ. వన = నీటియందు, జ = పుట్టినది; వనజము = నీటియందు పుట్టినది పద్మము, వనజమునుండి, భవుడు, పుట్టిన వాడు, బ్రహ్మ. ఈయన సృష్టికర్త.

టీ. సుదతీ, ధనమును = పల్పును, సంతతి = సంతానమును, (కుమారులు కుమారికలు మొదలైన వారు) కలిగిన = పొందియున్న, వనితల గని = స్త్రీలనుచూచి, ఎప్పుడున్, మనమునైన = మనస్సునందైనను, తగ వకుము = విచారింపకుము; మంచిచెడుగులు = మంచియు, చెడ్డయును, వనజభవుడు = బ్రహ్మ, ఎట్లు = ఏవిధముగ, వ్రాసెన్ = వ్రాసియున్నాడో, అట్లు = వ్రాసినట్లుగ, కలుగును; కనుగొనుమా = చూడుమా.

తా. ఇతరుల భాగ్యమునుచూచి అసూయపడకుము. బ్రహ్మఎట్లు వ్రాసిన అట్లు తప్పక జరుగునని తెలిసికొనుము.

క. ఒరులకు కష్టము వచ్చిన
తరి వారల నాదరింపదగు మరి దానన్
పరమార్థము చేకుఱు నిను
ధర దయగల వనితయంద్రు తప్పకసుదతీ. 94

టీ. సుదతీ, ఒరులకు = ఇతరజనులకు, కష్టమువచ్చినతరి = కష్టము కలిగిన సమయమునందు, వారలన్ = ఆకష్టపడువారలను. ఆదరింపగా దగున్ = ఆదరించవలయును; మరి, దానన్ = అందుచే, పరమార్థము = పుణ్యము, చేకురు = కలుగును; ధరన్ = భూమియందు, నినున్ = నిన్ను, తప్పక, దయగల = దయగలిగినట్టి, వనిత = స్త్రీయని, యంద్రు = పిలుతురు.

తా. కష్టకాలమువనున్నవారలకు సహాయము చేసిన స్త్రీ పుణ్యము గట్టుకొనును. దయగల స్త్రీ అని ఆమెను అందరును పిలుతురు.

క. వికలాంగుల గని యెప్పుడు
నెకసక్కెము లాడగూడ దిదిదోసంబౌ
సకలేశుని మహిమకదా
యొకని వశమె మాన్పుకొనగ నుర్విని సుదతీ. 95

టీ. సుదతీ, వికలాంగులన్ = అంగవిహీనులగువారిని, (కుంటివారిని, గ్రుడ్డివారిని, కుష్ఠురోగులను) కని = చూచి, ఎపుడున్, ఎకసక్కెములు = మనమునకు నొప్పికలుగు మాటలను, ఆడకూడదు = పలుకరాదు; ఇది = ఇట్లు పలుకుట, దోసంబౌ = తప్పిదమగును; ఉర్విని = భూమియందు, మాన్పుకొనగన్ = లేకుండచేసికొనుట (అవయవహీనతను) ఒకనివశమె = ఒకనికి లోబడి యున్నదా? (కష్టములు తచ్చిన తమంత దామే రక్షించుకొనలేరు. కలుగజేయువాడు, రక్షించువాడు ఒకడు ఉన్నాడని తెలిసికొనుము). సకలేశుని = భగవంతుని; మహిమగదా = గొప్పతనముగదా!

తా. రోగిష్ఠులను, కుంటి, గ్రుడ్డి మొదలైన వారిని చూచి ఏవగింపరాదు. దయతో ఆదరించవలయును. కష్టసుఖములకు మనము కర్తలము కాము. అవంతయు దేవుని ఇష్టప్రకారము జరుగుచున్నది, మనము ఏమియు చేయలేము.

క. కీడొరులకైన గోరకు
మాడెడు మాటలను నెప్పుడశ్లీలంబుల్
కూడదు మునుపే పెద్దలు
చేడెరో శ్రుతులందు దెలియజెప్పిరి సుదతీ. 96

టీ. సుదతీ, ఒరులకైనన్ = ఇతరులకైనను, కీడు = అపకారము, కోరకుము; ఆడెడుమాటలను = చెప్పెడు మాటలయందు, (మాటలాడునపుడు) ఎపుడు, అశ్లీలంబుల్ = అశుభ, (అమంగళపు) పలుకులును, కూడదు = తగదు; చేడెరో = ఓ స్త్రీ, మునుపె = పూర్వమె; శ్రుతులందు = వేదశాస్త్రములయందు, పెద్దలు, తెలియన్ = తెలియునట్లు, చెప్పిరి.

తా. ఒకరికి కీడు రాకోరుటయును, అమంగళపు పలుకులు పలుకుటయును కూడదు. ఈ నీతిని పెద్దలు శాస్త్రమునందు చెప్పిరి.

క. కలదానవైన బీదల
పలువిధముల నాదరింప భాగ్యము జగతిన్
గల సంపదలను వెంటను
బాలతిగొ నిపోవ రెవరు పొందుమగ సుదతీ. 97

టీ. సుదతీ, జగతిన్ = భూమియందు, కలదానవైనన్ = డబ్బున్న దానవైనను, బీదల = డబ్బులేని వారిని, పలువిధములన్ = అనేక విధముల ఆదరింపన్ = సేవించుట, మర్యాదచేయుట, భాగ్యము = తగును; బాలతిగా = ఓ స్త్రీ, కల సంపదలను = కలిగిన భాగ్యములను, ఎవరు, పొందుమగన్ = భద్రముగ, వెంటను = తమ వెంటను, కొనిపోవరు = తీసికొని వెళ్ళరు.

తా. డబ్బుగలవారు తప్పక లేనివారికి సహాయము చేయవలయును; చచ్చిన తరువాత డబ్బుకూడ వెంట వెళ్ళదు. మంచి పేరే నిలుచును.

క. నీయింటికి భోజనమున
కేయువతులనయిన బిలచితేని ప్రియముతో
వేయి విధంబుల నీవే
యా యువతుల నాదరించు మప్పుడు సుదతీ. 98

టీ. సుదతీ, భోజనమునకు, నీయింటికి, ఏయువతుల నైనన్ = ఏస్త్రీల నైనను, పిలచితేనిన్ = పిలచినయెడల, అప్పుడు = ఆపిలచినప్పుడు, ప్రియముతోన్ = ప్రేమతో, వేయివిధంబులన్ = అనేకరీతుల, నీవే = నీవు ఒక్కతెవే, ఆయువతులన్ = ఆస్త్రీలను, ఆదరించుము = మర్యాదచేయుము. (గౌరవింపుము.)

తా. ఎవరినైన భోజనమునకు పిలచిన నీవు ఒక్కతెవు శ్రద్ధతో గౌరవించి కనుగొనవలయును.

క. మందులచే బతివశ్యము
తొందరగా జేతువనెడి తొత్రివను కిడా

కొందరు మందిడి పతి దమ
ముందర గోల్పోయి రిలను మూర్ఖత సుదతీ. 99

టీ. సుదతీ, మందులచేన్ = ఔషధములచేత (వైద్యులు రోగులకు మందు లిచ్చెదరు.) పతిన్ = భర్తను, కొందరగాన్ = వేగముగ, వశ్యము = తనకు లోబడినవారిగ, చేతున్ = చేతును, అనెడి = చెప్పెడి, త్రోవను = మార్గము, కీడౌ = అపకారమగును; కొందరు = కొందరు స్త్రీలు, మూర్ఖతన్ = పట్టుదలచే, మందిడి = తమ భర్తలకు మందుపెట్టి, పతిన్ = భర్తను, తమముందరన్ = తమ ఎదుటనె, ఇలన్ = భూమియందు, గోల్పోయిరి = పోగొట్టుకొనిరి.

తా. మందుపెట్టి త్వరలో భర్తను లోబరచుకొందునని స్త్రీ చెప్పుటమంచిదికాదు. ఏలయన, అనేకమంది తమ భర్తలకు మందుపెట్టి తమ ఎదుట భర్తలను చంపుకొనిరి.

క. సంతతిచేతను వంశం
బంతయు నంతరము లేక ననయము నిలుచున్
సంతతికీవె నిదానము
సంతతమును దెలియుమమ్మ చక్కఁగ సుదతీ. 100

టీ. సుదతీ; సంతతిచేతను = సంతానము చేతనే, వంశంబంతయును = తాతతండ్రుల పరంపర, అనయము = ఎల్లప్పుడు, అంతరము = ఎడతెంపులేక, నిలుచున్ = నిలుచును; సంతతికి = సంతానము కలుగుటకు, ఈవె = నీవే, నిదానము = ఉదాహరణము, కారణము; చక్కఁగన్, సంతతమును = ఎల్లప్పుడును, తెలియుమమ్మ = తెలిసికొనవలెను.

తా. (మగ) సంతానముండిన వంశము పాడుగాక నిలుచును. అట్టి సంతానము కలుగుటకు స్త్రీ యాలాధారమై యున్నది. ప్రతి ఆడుది ఈ విషయము తెలిసికొన వలయును.

క. పరుల పయిన్ వరులపయిన్
దిరముగ గోపంబుబూని తిట్టుచెప్పుడు నో
రెరుగని పసిపిల్లల నొడ
లెరుగక మోదకుము పిదపనెంచెదు సుదతీ. 101

టీ. సుదతీ, పరులపయిన్ = ఇతరులమీదను, వరులపయిన్ = భర్తలపైనను, తిరముగన్ = స్థిరముగ, కోపంబుబూని = కోపముచే, ఎప్పుడున్, తిట్టుచు, ఒడలెరుగక = మంచిచెడ్డలు తెలిసికొనజాలక, ఒళ్ళెరుగక, నోరెరుగని = నోరుతెరచి తమపాట్లను చెప్పుకొనలేని, పసిపిల్లలను = చంటిబిడ్డలను, మోదకుము = కొట్టకుము, దండింపకుము; పిదపన్ = అటుతర్వాత, ఎంచెదు = విచారించెదవు? (ఎందుకు కొట్టితిమి అనివిచారించెదవు.)

తా. ఇతరులపైనను, తమభర్తయందుండు కోపము చేతను, ఒళ్ళు తెలియక స్త్రీ తనపసిబిడ్డను చావగొట్టి, క్షణకాలమునకు తిరిగి (కోపము తగ్గినతరువాత) కారణము లేనిదే ఎందుకు కొట్టితిమి అని ఏడ్చును.

క. చెడునడత గలిగి మెలగుచు
యువతులు కొందరిలలోన భర్తలతోడన్
బుడుతల మీదను వట్టిడి
వడిబొంకుదురదియె జెఱచువారిని సుదతీ. 102

టీ. సుదతీ. ఇలలోనన్ = భూమియందు, యువతులుకొందరు = స్త్రీలు కొందరు, చెడునడత గలిగి = అవివేకులై, అజ్ఞానులై, మెలగుచున్ = తిరుగుచు, భర్తలతోడన్ = తమభర్తలతో, వడి = త్వరగ, వివేకములేక = తెలివిలేక, బుడుతలమీదన్ = పసిపిల్లలమీద, వట్టిడి = వట్టుబెట్టుకొని, బొంకుదురు = అబద్ధము లాడెదరు; వారిని = అట్టి స్త్రీలను; అదియె = అట్లు వట్టుపెట్టుకొనుటె, చెఱచున్ = పాడుచేయును. (నాశము చేయును.)

తా. చెడునడతగల స్త్రీ తనబిడ్డమీద వట్టుపెట్టుకొని భర్తను మోసము చేసినను, ఆవట్టుయొక్క ఫలితమును వెంటనే పొందును.

క. తిట్టకు పిల్లల నెప్పుడును
కొట్టకు మేతరిని నీదు కోపముకొలదిన్
అట్టులయిన నీయాజ్ఞను
గట్టిగ జేకొనరు కల్లగాదిది సుదతీ. 103

టీ. సుదతీ, పిల్లలను, ఎప్పుడున్, తిట్టకు; నీదు కోపముకొలదిన్ = నీయొక్క కోపమునంతటిని చూపించుచు, ఏతరిని = ఏసమయమందును, కొట్టకుము; (కొలది = పరిమాణము) అట్టులయిన = ఎప్పుడును కొట్టుచు తిట్టుచు ఉండిన యెడల, నీయాజ్ఞను = నీయొక్క ఉత్తరువును (నీమాటను) గట్టిగన్ = శ్రద్ధగ, చేకొనరు = తీసికొనరు, ఇది = వినకుండుట కల్ల గాదు = అబద్ధము కాదు; నిజము.

క. సంతతిపై తల్లికి మతి
యెంతయుదయలేని యెడల నేవిధి పెరుగున్
జంతువుల నెల్ల జూడవె
చెంతను దా బిల్లజేర్చి మెలగుట సుదతీ. 104

టీ. సుదతీ, సంతతిపై = తనపిల్లలమీద, మతి, ఎంతయుదయలేని యెడల = కనికరము ఎంతమాత్రము లేనియెడల, ఏవిధిన్ = ఏరీతిగ, పెరుగున్ = పెరుగును? జంతువుల నెల్లన్ = జంతువుల అన్నింటిని, తాన్ = తాను, (జంతువు) పిల్లజేర్చి = తనపిల్లను దగ్గరకు తీసికొని, మెలగుట = సంచరించుట, చూడవె = చూస్తున్నాము.

తా. తల్లికి తన పిల్లలపై ప్రేమ లేకపోయిన వారెట్లు పెరుగుదురు? జంతువులుగూడ తమ పిల్లలను వెంటబెట్టుకొని తిరుగుట మనము చూచుచున్నాము. వాటివలె మనుష్యులును ప్రేమకలిగి పిల్లలను పోషింపవలయును.

క. మాటలు వచ్చిన పిల్లల
మాటలచే దెలుపవలయు మరి కసరకు నీ
మాట వినునట్లు నేర్పుము
మాటికి మాటికిని నాజ్ఞమార్చకు సుదతీ. 105

టీ. సుదతీ, మాటలువచ్చిన పిల్లల = మాట్లాడ నేర్చిన పిల్లలను, మాటలచే=మాటలచేతనే, తెలుపవలయుఁ గా, మరి, కసరకు=కోపించకుము; నీమాట=నీవు చెప్పుమాటను, వినునట్లు నేర్పుము = నీమాటవిని చేయునట్లు నేర్పవలయును; ఆజ్ఞ=ఉత్తరువును, మాటిమాటికిని = ప్రతినిమిషము నను, మార్చకు = మార్పు చేయకుము.

తా. మాటలువచ్చిన పిల్లలకు నెమ్మదిగ మాటలచేతనె సమాధానపరుపవలయును. వారిని కోపించరాదు. నీవు చెప్పిన మాటదాటక ఉండునట్లు తయారుచేయవలయును. అనేకపనులు ఒక్కసమయముననె చెప్పరాదు.

క. తల్లుల గుణదోషంబులు
పిల్లలకును నబ్బుగాన బిగ్గరగా నీ
పిల్లలముందర నరువకు
కల్లలు బలుకకుము మెలగు ఘనముగ సుదతీ. 106

టీ. సుదతీ, తల్లుల = తల్లులయొక్క, గుణదోషంబులు = చెడుగుణములు (గుణములయొక్క ఫలములు) అనగా మంచిచెడుగుణములు, పిల్లలకును, అబ్బున్ = కలుగును; కావన్ = కాబట్టి, నీపిల్లల ముందరన్ = నీపిల్లల ఎదుట, బిగ్గరగా = గొంతుకపగులు నట్లుగ, నరువకు=కేకలువేయకుము; (స్త్రీలుబిగ్గరగ నరువక నెమ్మదిగ మాట్లాడవలయును.) కల్లలున్ = అబద్ధములను, పలుకకుము, ఘనముగ = గొప్పతనముగ, మెలగుము = నడచుకొనుము.

తా. తల్లుల గుణములు పిల్లలకు కలుగును. కావున పిల్లలెదుట అరచుట, అబద్ధమాడుట మొదలైన చెడుపనులను తల్లులు చేయరాదు.

క. జనకుండాజ్ఞను మీరిన
తనయుని దండించునట్టి తరి నడ్డముగా
మునికొని పోవకు మెప్పుడును భువి
కని గనన ట్లున్న మేలుగద భువి సుదతీ. 107

టీ. సుదతీ, భువిన్=భూమియందు, జనకుండు=తండ్రి, ఆజ్ఞను=మాటను, ఉత్తరువును, మీరిన=దాటిన, తనయుని=కుమారుని, దండించునట్టితరి=శిక్షించు సమయమున, ఎప్పుడును, అడ్డముగా=తండ్రి కుమారుని మధ్యగ, మునికొని=ముందుపెట్టుకొని, వెనకేసికొని, పోవకుము=పోవలదు; భువి, కని=చూచియును, కననట్లు=చూడనట్లు, ఉన్నన్=ఉన్నయెడల, మేలుగదా=మంచిదిగదా (మంచిది).

తా. తప్పుచేసిన తనయుని దండించునపుడు ప్రేమచే తల్లి అడ్డము వెళ్ళరాదు. చూచియు చూడనట్లుండవలెను. అట్లు ఊరకుండుటమంచిది.

క. గారాబముచే బసి వా
రూరక నేడ్చెదరు వారి నూరార్చుటకై
కోరిన వస్తువు లిడకుము
వారలకిట్టి యలవాటు వలదిల సుదతీ. 108

టీ. సుదతీ, గారాబముచే=ముద్దుగా పెంచుటచే, పసివారు=చిన్నపిల్లలు, ఊరకన్=ఊరకనె, ఏడ్చెదరు=దుఃఖించెదరు; వారిన్=అట్లు ఏడ్చువారిని, ఊరార్చుటకై=మాన్పించుటకు, కోరిన వస్తువుల్=పిల్లలు కావలయునని చెప్పిన వాటిని, ఇడకుము=ఇవ్వకుము; ఇలన్=భూమియందు, వారలకు=ఆ చంటిపిల్లలకు, ఇట్టి యలవాటు=కోరినవి ఇచ్చు ఆచారము, వలదు=కూడదు.

తా. గారాబముచే పిల్లలు ఏడ్చిన వారిని మాన్పుటకును వారికి కావలసిన వస్తువులిచ్చి ఊరకుండు లాగున చేయుట తప్పు. ఇది చెడు అలవాటు. ఇతర వస్తువులు ఇచ్చి మాన్పవలయును.

క. చలికాలంబున బిడ్డల
వలువలు లేకుండ దిరుగ వద్దని నీవే
తెలిపి వెస వానిదొడుగుము
చలికి దిరుగ జబ్బు పడుట సత్యము సుదతీ. 109

టీ. సుదతీ, చలికాలంబున = చలివేయునప్పుడు, సీతకాలమున, వలువలు = బట్టలు, లేకుండ = తొడుగక, నీవు, బిడ్డలన్ = పిల్లలను, తిరుగవద్దని, తెలిపి = చెప్పి, వెస = తొందరగ, వాని = ఆబట్టలను, తొడుగుము = తొడుగవలసినది; బాలుర్, చలికి దిరుగన్ = శీతగాలియందు తిరిగిన, జబ్బుపడుట = రోగి యగుట, సత్యము = నిజము.

తా. చలికాలమందు పిల్లలకు చక్కగ నేర్పి శీతగాలిలో తిరుగనీయక బట్టలు (చొక్కా, లాగూలను) తొడుగ వలెను. లేనిచో నిజముగ జబ్బుచేయునని నమ్మెను.

క. నీ పిల్లలతో నాడుట
కే పిల్లలుగాని యింటికే తెంచినచో
కోపించకు పరులిండ్లకు
నీపిల్లలు పోరె యాడ నిరతము సుదతీ. 110

టీ. సుదతీ, యింటికి, నీపిల్లలతోన్ = నీపిల్లకాయలతో, ఆడుటకు = ఆడుకొనుటకు, ఏ పిల్లలుగాని = ఎవరిపిల్లలైనను, ఏతెంచినచో = వచ్చిన యెడల, కోపించకు = కోపముచేయవద్దు; నిరతము = ఎల్లప్పుడు, నీపిల్లలు, పరులిండ్లకు = ఇతరుల ఇళ్ళకు, ఆడన్ = ఆడుటకు, పోరె = పోరా? (వెళ్ళుదురు).

తా. ఇంటికి పిల్లలతో ఆడుకొనుటకు వచ్చిన పిల్లలను కోపము చేయరాదు. ఏలయన తన పిల్లలు కూడ తరుచు ఇతరుల ఇళ్లకు ఆడుటకు వెళ్ళరా?

క. పతికైనను నీకైనను
సతతంబును నీదుముద్దు సంతతికైనన్
క్షితి జాడ్యమైన నౌషధ
మతిరయమున దగును *సోదు లడుగకు సుదతీ. 111

టీ. సుదతీ, పతికైనను = భర్తకైనను, నీకైనను = నీకు అయినను, నీదు = నీయొక్క, ముద్దుసంతతికైనన్ = ముద్దుగు పిల్లలకయినను సతతంబున్ = ఎల్లప్పుడు, క్షితిన్ = భూమియందు, జాడ్యమైన = రోగము వచ్చిన యెడల, అతిరయమునన్ = మిక్కిలి వేగముగ, ఔషధము = మందు, తగును; సోదులడుగకు = సోదులు అడుగకుము.

తా. ఇంటిలో ఎవరికి జబ్బుచేసినను మందులను ఇయ్యవలయునే కాని సోదులు అడుగరాదు.

క. తడిబట్టగట్టి నిరతము
మడిమడియని మధ్యమధ్య మరల తడుపుచున్
తడబడి వంటంజేయుట
పడతిరో సుఖశౌచములకు భంగము సుదతీ. 112

టీ. సుదతీ, పడతిరో = ఓబాలా, నిరతము = ఎల్లప్పుడును, మడి మడి యని = మడియని, తడిబట్టగట్టి = తడిబట్టకట్టుకొని, మధ్యమధ్య = అప్పుడప్పుడు, మరల, తడుపుచున్ = తడుపుచు, తడబడి = తొందరబడి, (కాళ్ళు విరుగదొక్కుకొని) వంటంజేయుట = వంటచేయుట, సుఖశౌచములకు = సుఖమునకును, శుచిత్వమునకును, భంగము = నష్టము.

---

* సోదులు:—సామాన్యముగ మంచి చెడుగుల దెలిసికొనుటకై ఎఱుకల సోదులడిగెదరు.

తా. తడిబట్టలు కట్టుకొని తడబడి వంటలు చేయుచు, మడిమడి అనుచు మధ్యమధ్య బట్టలు తడుపుచు ఉండిన జబ్బుచేయును. సుఖమువ తును, శుద్ధతకును భంగము కలుగును.

క. నారులు సాహసిను లనెడి
పేరును చిత్రాంగినిలిపి బేలై చెడగా
*సారంగధరుని చరితము
మీరు జదువుపాటయయ్యె మేదిని సుదతీ. 113

టీ. సుదతీ, నారులు = స్త్రీలు, సాహసినులనెడి = సాహసముగల వారని చెప్పునట్టి, పేరును = వాడుకను, నిలిపి = నిలువబెట్టి. చిత్రాంగి, బేలై చెడగా = నిందపడగా, సారంగధరుని చరిత్రము = సారంగధరుని కథ, మేదిని = భూమియందు, మీరు, చదువుపాటయయ్యె = చదివెడు పాటఅయినది.

తా. స్త్రీలు సాహసముగలవారను పేరును చిత్రాంగి శాశ్వతముగ నిలిపినది. అట్టి సారంగధరుని చరిత్రమును మీరు పాటగాపాడుచున్నారు.

---

* సారంగధరుని చరిత్ర:—రాజరాజనరేంద్రుని రాజధాని రాజమహేంద్రవరము. సారంగధరుడు రాజరాజనరేంద్రుని కుమారుడు. చిత్రాంగిని తన కుమారునకు పెండ్లిచేయుటకు తీసికొని వచ్చెను. కాని ముసలివాడైనను రాజు ఆమెను ప్రేమించి, పెండ్లియాడెను. చిత్రాంగి కంతగా నిష్టములేదు. ఒకానొకప్పుడు సారంగధరునిపావురము చిత్రాంగి నగరుపై వ్రాలెను దానిని తెచ్చుటకు సారంగధరుడు పినతల్లి మేడకు పోయెను. చిత్రాంగి అనేక విధముల రాజకుమారుని బ్రతిమాలు కొనెను. అతని కిష్టము లేదు. రాజువచ్చువేళ నతిక్రమింప, కుమారుడు వెడలెను. లేనిపోని నేరములా కుమారునిపై మోపి చిత్రాంగి రాజుతో చెప్పెను. రాజు ఆమాటలు నమ్మి సారంగధరుని శిక్షించెను. 'చిత్రాంగి ఈవిధముగ సాహసురా' లని పించుకొనెను.

క. నీతులు నేరిచికొందరు
భూతలమున గఱపుచుంద్రు బుద్ధులొరులకున్
చేతలుకడు నింద్యములగు
ఖ్యాతిగ నాచరణయుండ గాదగు సుదతీ. 114

టీ. సుదతీ, భూతలమునన్ = భూమియందు, కొందరు, నీతులు నేరిచి = అనేక మంచివిషయములను తెలిసికొని, ఒరులకున్ = ఇతరులకు, బుద్ధులు = నీతులు, కఱపుచు = నేర్పుచు, ఉంద్రు = ఉందురు, (వారి) చేతలు = చేయుపనులు, (అట్టినీతులు నేర్పువారుచేయు పనులు) కడు = మిక్కిలి, నింద్యములగు = నిందింపదగినవి; ఖ్యాతిగన్ = కీర్తి కలుగు లాగున, ఆచరణ యుండ గాదగున్ = ఆచారమునందుంచవలయును, (తామును ఎల్లప్పుడు ఆనీతిమార్గములనే అనుసరించవలయును.)

తా. నీతులు ఇతరులకు చెప్పుదురు. కాని ఆచెప్పువారు ఆచరణ యందుంచలేరు. వారు ఆచరణలో పెట్టిన ఇతరులకు చెప్పనవసరము లేకుండగనే మార్గమును చూపినవారలగుదురు.

క. క్షమనెంతకష్టమైనను
తమనాథుని తోడనుండ దగును తరుణికిన్
*దమయంతిచంద్రమతియును
నమితయశము వడసిరిందు ననయము సుదతీ. 115

* దమయంతి:—విదర్భదేశరాజగు భీష్మునికుమార్తె. ఈమెభర్త నలమహారాజు, తమ్మునిచే జూదమందు కోడింపబడి అడవులపాలాయెను. దమయంతి నలుని వెంబడించెను. ఆమెకష్టమును చూడలేక నలుడు అర్ధరాత్రమున ఆమెతో చెప్పకయే విడలిపోయెను. ఋతుపర్ణుని కొలువుచేరెను. మేల్కొనిన దమయంతి భర్తనుగానక, విలపించిఎట్టకేలకు

టీ. సుదతి, శుమన్ = ఓర్పుచే, ఎంతకష్టమైనను = ఓర్పుటకు కష్టమైనను, తరుణికిన్ = స్త్రీకి, తన నాథునితోన్ = తన భర్తతో డనే, ఉండవలెను = ఉండుట చెల్లును; అనయము = ఎప్పుడును, ఇందు = భూమి యందు, దమయంతి, *చంద్రమతి, అమిత = మిక్కిలి, యశము = కీర్తి, గౌరవము, గొప్పతనమును, వడసిరి = పొందిరి.

తా. ఎంత కష్టకాలమునందైనను స్త్రీ భర్తను వదలరాదు. దమయంతీ చంద్రమతులు తమ భర్తలెంత కష్టములలో నున్నను, వారిని వదలిపెట్టక కీర్తి పొందిరి.

క. సూరిజన వినుత యశుడగు
సూరి శ్రీసుబ్బరాయ సుజ్ఞానికి నే
గూరిమి పుత్రుడ కృష్ణయ
శారద దయను నుడివితిని శతకము సుదతీ. 116

---

తన పినతల్లి నగరముచేరి సైరంధ్రివేషంబున నుండెను. భీముడు కుమార్తెను అల్లునివెదకించెను. కుమార్తెవచ్చినతరువాత ద్వితీయ స్వయంవరము చాటింప నలుడును అచ్చోటికి పోయెను. తెలిసికొనిన పిమ్మట, భార్యాభర్త అన్యోన్యముగ ఉండి కాలము సుఖముగ గడపిరి. పూర్వపు ఐశ్వర్యమును పొందిరి.

* చంద్రమతి:—ఇక్ష్వాకువంశపురాణి. శ్రీ సత్య హరిశ్చంద్రుని భార్య. రాజు విశ్వామిత్రునకు (సప్తమహర్షులలో నొకడు. కశ్యపుడు, అత్రి, భరద్వాజుడు, విశ్వామిత్రుడు, గౌతముడు, జమదగ్ని, వసిష్ఠుడు) రాజ్యము ధారవోసి ముని ఋణంబులకై అగణ్యములగు పోవలసివచ్చెను. చంద్రమతి రాజు ననుసరించెను. అనేక కష్టములను పొంది మునిచేపొగడబడినవారలై క్రమముగ రాజ్యమును గైకొనిరి.

టీ. సుదతీ, సూరిజన=పండితులలో, వినుత = పొగడదగు, యశుడగు = కీర్తివంతుడగు, సూరి శ్రీసుబ్బరాయ, సు = మంచి, జ్ఞానికి = వేత్తకు, నేఁ = నేను. కూరిమిపుత్రుడ = యనుంగు కుమారుడను, కృష్ణయ్య; శారదదయను=శారదాదేవి కటాక్షముచే, శతకము, నుడివితిఁ = చెప్పితిని.

తా. పండితులలో పొగడఁదగిన కీర్తివంతులగు శ్రీ సూరి సుబ్బారాయుని కుమారుడగు కృష్ణయ్యను శ్రీ శారదాదేవి దయవలన 'ఈసుదతీ సునీతి' శతకమును రచించితిని.

టీకాతాత్పర్యసహితము

సంపూర్ణము.

---

# అష్టాదశపురాణ

# సారసంగ్రహము

## నాల్గు భాగములు

## భాగము 1కి రు 1-0-0.

ఈ పురాణములు పదునెనిమిదియు నాలుగుభాగములుగ విడదీసి అందఱికిసులభ సాధ్యమగు నట్లుముద్రించి సిద్ధముచేసియున్నాము. ఈపురాణ సారసంగ్రహమును, ఆబాలగోపాలము స్త్రీలును పురుషులును చదువుకొనియానందింప నెన్నడు కనివిని యెఱుంగని కథలను సులభశైలిని రసముప్పతిల్లునట్లు వ్రాసి యాంధ్రప్రపంచమున కొసంగిన బ్ర॥ వేమూరి జగన్నాథశర్మ గారు ఐహికాముష్మికముల యందు కీర్తిని సంపాదించుటయేగాక సర్వజన సామాన్యమునకును నట్టి మహత్తరసంపదను గలుగఁజేసి యున్నారు. దీనిని గుఱించి మహామహులిచ్చిన యభిప్రాయములే యిందు లకు నిదర్శనము. మాతృభాషా వ[illegible]ము లేనివారి కందరికిని ఒలిచియరటిపండును చేతనిడినట్లు పెట్టియుండిరి. కావున నిందలియనుభవము [illegible] బాత్రులగుదురు గాక యని కోరుచున్నాము.

వలయువారు :— సీతారాం అండ్ కో-తెనాలి.

